శ్రీ

# యాదవాద్రీశోపాఖ్యానము.

(0)

ఇది

## శ్రీ కామిసెట్టి వేరమదొరగారిచే

రచియింపఁబడి

సరస చతుర్విధ కవితాసామ్రాజ్య ధురంధరులును

హిందూస్థానాంధ్రభాషా కవివరులును

అగు బ్రహ్మశ్రీ

## నాదెళ్ల పురుషోత్తమశాస్త్రులుగారిచే

పరిష్కరింపఁబడి


ఆర్యానందముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

మచిలీపట్టణము

1916




దీని వెల ఆఱుఅణాలు.

# మంగళాశీస్సు.





సీ. శ్రీమహితంబయి చెల్వొందువల్లూరు
దక్షిణాంతర్భాగ రక్షకుండు
వరబొమ్మదేవర వంశపాథోరాశి
పరిపూర్ణచంద్రుండు భాగ్యకారి
నరపతిసుతసత్య నారాయణవరప్ర
సాదనాయఁడు ప్రభుసత్తముండు
నళవసంతర్తువునందు వేంకటలక్ష్మి
నరసాంబఁ జేపట్టెఁ బరిణయమున

తే. అట్టియుత్సవమందు బయల్వెడలెను
బీబినాంచారు శ్రీహరిఁ బెండ్లియాడి
నట్టిసచ్చరితంబిది యామహాత్మ
లింపుసంపదలిత్తురీ దంపతులకు.

శా. శ్రీవల్లూరుపురంబు నందలరు నా శ్రీవేణుగోపాలుఁడ
న్దేవగ్రామణినూత్న దంపతులకు న్దీర్ఘాయురారోగ్యము
ల్శ్రీవిస్రంజిలునిత్య హర్షమును బ్రాలే యాద్రిధైర్యంబుశో
భావిస్తారులఁ బుత్త్రరత్నముల నొప్పంగల్గఁ జేయున్సదా.

ఉ. శ్రీయుతుఁడౌచు భూరమణశేఖరుఁడౌచు నిజాప్తసౌఖ్యసం
ధాయకుఁడౌచుసాధు జనదైన్యనివారకుఁడౌచు సర్వదా,
న్యాయమెఱింగివర్తిలు మహామహిమాఢ్యుఁడు నౌచుసత్యనా
రాయణదివ్యనాముఁడు విరాజిలుఁగాత బుధప్రశస్తుఁడై.

# పీఠిక.

గోదావరి మండలంబునఁగల యేనామ్‌నగరపువాస్తవ్యులును అచటి ఫ్రెంచ్ గవర్నమెంటువారిచే ద్విభాషియుద్యోగ మొనరించియుండినవారును ఇపుడు వయోవృద్ధులయియున్నవారునగు శ్రీ కామిసెట్టి పేరమనాయఁడుగారు అనేకసంస్కృతాంధ్ర గ్రంథములను బహులక్ష్యముతోఁ బలుమాఱు చదివి సారముగ్రోలినందునఁ గలిగియున్న పాండిత్యమును భక్తిసామర్థ్యమునఁగలిగిన కవిత్వధారను అండఁజేసికొని తమకతిప్రీతికరమగునీ పావనచరిత్రమును ప్రబంధముగరచియించి యోపికయుంబర శ్రేయసహానమునుగల లాక్షణికులచేఁ బరిష్కరింపఁజేయుదమని కొనుచుండిరి. తత్తృతీయపుత్త్రులగు శ్రీవేణుగోపాలరావునాయఁడుగారు మ-రా-రా-శ్రీ శ్రీరాజాబొమ్మదేవర సత్యనారాయణ వరప్రసాదనాయఁడు బహద్దూర్ జమీన్దార్ గారు బాల్యముననున్నప్పుడు వారికి గార్డియనుగానుంచని బందరునందుండిరి. నేనపుడు హిందూబ్రాంచ్ స్కూలుహెడ్మాస్టరుగానుంటిని. సదరుమైనర్ రాజాగారు కొద్దికాలము నాయొద్దఁ జదివికొన్న సందర్భమున వారి వెడఁబాయని గార్డియనుగారితో నాకుఁ బరిచయమేర్పడెను. నేనాంధ్రహిందూస్థానభాషలందుఁ గవిత్వము చెప్పుదునను మొదలగు నావిశేషములేవియో యీనాయఁడుగారి తండ్రిగారికివ్రాసిరి. వారీగ్రంథము నొకజాబుసహా నాకిమ్మనియంపిరి. కాని నేనపుడు గురుభక్తిప్రభావమను ప్రబంధమును రచియించుచుండిన కాలమగుటనిది యట్లేయుంచితి. పిదపనొకప్పుడేను ఏనామునకుఁబోఁగలిగి యీగ్రంథకర్తగారిని దర్శించితిని. వీరియశస్సును వింటిని. అభినవాజాతశత్రువను బిరుదమందఁదగినవారు. వీరుమహర్షిసములని నామనసునకు లక్ష్యముకుదిరెను. ఈగ్రంథమునచ్చుపఱచుటయందువారికిఁగల కుతూహలమును దెలిపిరి. ఆమోదించితి. అటుపై నేదీనిందయ్యారుచేసివారికిఁ బంపితిని. కథాసందర్భమట్టిదికావునఁ గడకడ సమయోచితముగఁ జేర్పఁబడిన హిందుస్థానీకల్పనలకును దక్కినయొప్పిదములకును దమకొదవిన యానందమును దెలియఁబఱచిరి నాకువీలయినపుడచ్చుకూడ నన్నేవేయింపుమనియుండిరి. తీరికయమరక కేవలము నేనురచించినవె యచ్చుపడకయట్లేయుండినందున నిదియునట్లేయుండవలసివచ్చెను. ఇపుడు నాగ్రంథములను ముద్రింపించుచున్నందున నిదియుంబ్రకటించుచున్నాఁడ. ఈగ్రంథకర్తగారింగూర్చి యొకానొక యాంధ్రపత్రిక సంవత్సరాదిసంచికయందు వీరిఫోటోనుజూపుచుఁ గొంతవిషయము సంక్షిప్తముగ వ్రాయఁబడియున్నది చాలమంది చూచియేయుందురు. వీరుమంచియాస్తికులు. తత్సనాతనమతము ననుసరించి యనేకస్మృతివచనము లుదాహరించుచుం బెక్కు లుపన్యాసములు వ్రాసియుంచియున్నారు. అవన్నియుం బ్రకటింపఁబడునేని లోకమునకెంత మేలయినం గాఁదగియుండెడి ననియనుట కవికాంచినవారించుకయు వెనుదీయరు.

నా. పు.

# శుద్ధపత్రిక.



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 24 | ఆని | అని. | 22 | 2 | పద | పథ |
| 4 | 10 | కాకుం | రాకుం | ,, | 20 | సోకి | సోఁకి |
| ,, | 27 | భూష | భాష | 23 | 2 | వతివ | చతివ |
| 5 | 16 | ఖ్యకు | ఖ్యాకు | ,, | 24 | జనక | జవక |
| ,, | 29 | జెకూరె | జేకూరె | 24 | 4 | వేట్క | వేడ్క |
| 6 | 5 | పృధలా | పృథలా | 25 | 25 | లోలు | లోల |
| ,, | 8 | వృథ్వ్యా | పృథ్వ్యా | ,, | 26 | సాద్వి | సాధ్వి |
| ,, | 26 | చుసం | చునుసం | 26 | 9 | జూడ | జాడ |
| 7 | 19 | భక్షిం | భిక్షిం | 27 | 1 | గోవ | గోప |
| 8 | 28 | నిల్వు | నిల్చు | 28 | 7 | బ్రధ | బ్రథ |
| ,, | 29 | యొక్కింతె | యొక్కింత | 29 | 3 | గస్త్ | రమ్త్ |
| 9 | 16 | దెవ | దైవ | 31 | 8 | లొమ్మ | బొమ్మ |
| ,, | 17 | కెర్తె | కేర్తె | ,, | 11 | భార | బార |
| ,, | 25 | వావ | నావ | ,, | 18 | ,, | ,, |
| 11 | 2 | నమ్మ | సమ్మ | ,, | 23 | ,, | ,, |
| ,, | 4 | తుమా | తమా | 33 | 20 | నింక | యింక |
| 14 | 11 | రస్ | రసి | 34 | 10 | ధిలీ | థిలీ |
| 16 | 17 | దెల్పం | తెల్పం | 36 | 4 | గ్రుంకె | క్రుంకె |
| ,, | 22 | కార్మ్శ | కార్శ్య | 38 | 8 | భత్రో | భద్రో |
| 17 | 28 | భార | బార | ,, | 13 | విదా | విధా |
| 18 | 18 | కర్క | కర్న | 39 | 1 | ఢంకా | డంకా |
| ,, | 27 | వినాహ | వివాహ | ,, | 3 | స్థానీ | స్థానపు |
| 19 | 2 | గార్య | కార్య | ,, | 11 | యేదో | యేవో |
| 20 | 16 | ప్రార్ధ | ప్రార్థ | 40 | 10 | లోనఁ | లోన |
| ,, | 17 | సత్పఛ | సత్పథ | ,, | 22 | కాంతు | కాంత |

శ్రీ

# యాదవాద్రీశోపాఖ్యానము.

## ప్రథమాశ్వాసము.



శా. శ్రీరంజిల్లెడు వక్షమొప్పునతని న్శ్రీయాదవాద్రీశుని
న్నీరేజోద్భవముఖ్యదేవవినుతు న్నిత్యుం గృపాంభోధిసో
దారుం దారుణపాపకాననశిఖిన్ దామోదరుం గొల్చెద
న్వారల్ కైకొనుపాటి కబ్బమిదియై యిక్షోణిం బ్రకాశింపఁగన్. 1

శా. భూమీశావళిపాలనంబున జనుల్ పొందంగ నుండిన
శ్రీమానాథుఁడు శౌరియంత ధరణి శ్రేయంబుఁ గల్గింపఁ దా
నేమేమో బహురూపభేదములతో నేర్పాటు పొందంగ నె
ట్లా మోదించునుగాదె యమ్మహితు నేన శ్రాంతముం గొల్చెదన్. 2

శా. ఆ వేదక్ష్మను యాదవాఖ్యమునఁ దావిర్భవించెన్ల స
చ్ఛ్రీవత్సాంకితుఁ డార్తరక్షకుఁడు తా శ్రీవేణుగోపాలుఁడై
తా వేర్వేఱు పురంబులందలరుట న్ధర్మాత్ముఁడై యొప్పటం
గావం జూచుత మమ్ము భక్తజనులం గల్యాణముల్ గూర్చుచున్. 3

మ. హరిరాణీశశిసోదరీ మహితయోగాంభోజపుష్పాలయా
నిరతానందశుభప్రదాయిని యవానిత్యప్రభావాన్వితా
సిరిసంపత్తు సుబుద్ధి కల్గి ప్రభతో క్షేమంబుగా నొప్పఁగా
సరసోదారతనిండు ప్రేమనుమము న్సాకంగ నీకాఁ జుమీ. 4

వ. అని విన్నవించి తజ్జగజ్జననీ జనకులకు హృదయరంజకంబుగ వినుపందలంచిన బీబీ
నాంచారాంబాకథాక్రమం బెట్లనిన. 5

క. మేదినిమును మ్లేచ్ఛావృత, మాదినములయందు దేవతాలయములలో
వాదింపవినక తురకలు, వేదూరిరి గాదె జనులు వెఱఁగుపడంగన్. 6

గీ. విగ్రహారాధనకువారు విముఖులగుట, మ్లేచ్ఛులందఱుగూడియు మేటివనఁగఁ
గలుగు దేవాలయంబులఁ గదలఁగొట్టి, విగ్రహంబులఁ గైకొను వేడ్కొదవ. 7

క. ఉత్సవవిగ్రహములఁ గొని, యుత్సాహము మీఱఁ జేర్చి రొకకోట్టునకుం
దత్సర్వవిఘాతదక్షీ, భత్సగసాస్పదుఁడు వారి పాదుషతనరన్. 8

క. ఎచ్చటికమాన్విజనులను, గుచ్ఛితములనోవఁజేసి కులవైరమున
న్విచ్ఛలవిడినలయించిరి, పచ్చనిధ్వజమొప్పఢిల్లిప్రభువులటఁగుచున్. 9

క. అటుపిమ్మటవారలెయో, గ్గటుసల్పక దేశధర్మ మరసెడువారై
ఘటియించిరిజాగీర్లం, బటుతరమాన్యములుఁదగిన ప్రముఖులకీడన్. 10

వ. పరమపావనస్థలంబగు నీ భరతఖండంబున నిట్టి యన్యరాజాధికారంబు ప్రాప్తిం
పను హిందువులు వారివారికి దయాపాత్రులైనసె శోధింపను గారణంబరయ. 11

క. ఒకదేశంబునఁ గ్రీస్తునిఁ, గొకతఱిఁబైగంబరార్యు లుదయించినని
య్యకలంకరాజ్యపదవియు, వికటములేకొదవనయ్యె వీరిఋవురకున్. 12

క. అకలంకకర్మభూమిని, సుకరముగాఋషులుదెల్పు శ్రుతిధర్మంబు
ల్వికటములయి పరశాస్త్రము, లకటాహిందువులకిప్పుడలనడవలసెన్. 13

వ. ఇట్లొక్కింత కాలంబుగడవ. 14

గీ. శంకరాచార్యయతిరాజ చారుమతులు, మధ్వగురురాయముఖ్యులు మహిని వెలసి
త్రిమతములుఁగూర్చితత్స్థిత సమితిఁజేర్చి, మరలదేవాలయంబులఁ బరగఁజేయ. 15

వ. అవసరంబుగలిగి విగ్రహాన్వేషణంబొనరింపవలసె నట్టియెడ శ్రీమద్రామానుజాచా
ర్య గురువరుండు. 16

గీ. విగ్రహంబులులేవని విన్నయపుడె, యున్నతావదిఢిల్లీయటన్నదివిని
దాసరులదండుతోడఁ ద్రిదండివెడలె, ఫౌజులెక్కింపఁదరముగా దోజవినుఁడు. 17

గీ. పులికిఁబూటకుమిరియాలెప్పుడైనంటు, యెందఱుందుగామీరలే యెంచికొనుఁడు.
ఇట్టిదాసేనఢిల్లీనిముట్టడింప, నతులవిస్మయమందిరప్పటివారు. 18

క. ఢిల్లీమైదానంబున, ఖిల్లాకునొమ్రిలఁజాల ఖేలనలీలం
దల్లక్షణంబులొప్పఁగ, గల్లోలపుహోదయుఁబుట్టఁ గళవళపడుచున్. 19

గీ. శత్రుబలములముట్టడి శబ్దమెసఁగ, వార్తతెలిసుక బేహుష్యార్వర్తనమున
మంత్రులారయలేదొకో మస్తికల్గి, మిత్రభేదముగానె నేమించినారో. 20

వ. అనియిట్లు పాదుషా దద్దరిల్లి ప్రధానిశేఖరులం బ్రశ్నింప. 21

గీ. మందుగుండులేని మహనీయుఁడొక్కఁడు, దాసవర్గదళముఁ దానువచ్చె
నందుదురముచిహ్న మరయరాకుండుట, శంకలేకయున్న చందమనిరి. 22

వ. అందులకు రాజిట్లనియె. 23

గీ. లక్షలకొలందిజనులొప్పులక్షణంబు, కత్తుగాకున్నఁగలదేదొ కర్కపాయె
దానిదెలియఁగవలయును దాల్మిలోడ, దాసరులటంచునిరసన తగదుమనకు. 24

గీ. మంత్రులును బండితులును విని మంచిదనుచు, యతివరుని గాంచి యతనికి నతులొనర్చి
యుష్మదాగమనార్థ మిట్లో మహాత్మ, అస్మదధికారి తెలియంగ నడుగఁబంపె. 25

వ. అని విన్నవించిన. 26

గీ. పాదుషాగారి దగ్గన ప్రాప్తిమాకుఁ, గలుగమా రాక హేతువు తెలుపఁబడున
టంచు ననవిని యామోద మంచుజనియుఁ, దెల్పి రామాట రాజుతోఁ బెల్లమగను.

గీ. రాజు సెలవిచ్చె నా యతిరాజవరుని, దేపుకనుఁగొందు ముచిత పురీతిగాను
మత్సభాస్థలిఁ జేర్పుచు మాత్యయనుచుఁ, దెలుపఁగాఁబడె వది యోగితిలకునకును.

గీ. అందులకు మోదమందుచు నానసరణిఁ, బ్రభుని దర్బారునకు యోగిపతియు నేగ
ఛత్రచామరముఖ రాజ సంపదలను, మంత్రివర్యుఁడె దుర్గా నెమానితిలకు. 29

కం. తాజీమొసఁగుచు గురుజీ, బాజూ ఎహ్తాఖ్ త్వరాప్ బైఠియెయనుచు
న్రాజా దాబనునంతనె, హాజీ కాజీవజీరులట్టులొనరుపన్. 30

గీ. శుభము శుభమంచు దీవెనసూక్తి పలుక, దివ్యరూపులు దినకర తేజులరయ
శమదమాన్వితులసములు సాధులనుచు, సభికులెల్లెడఁ బొగడిరి సన్మునీంద్రు. 31

కం. యతిరాజ ధరామరది, వ్యతపోధన మహిత యుష్మదాగమనమునం
గృతకృత్యుఁడనైతిని నే, నతిపావనమయ్యె నస్మదన్వయమెల్లన్. 32

వ. అని యర్థమిచ్చునట్లు పాదుషా ప్రస్తుతింప యతి రాజవర్యుండిట్లనియె. 33

గీ. రాజరాజవు మహనీయ రమ్యసుగుణ, నిధివటంచును విన్నంత నేఁడు కంటి
నాదు రాకయు నష్టంబు గాదు మీకు, నిష్ప్రయోజనమగు కోర్కె నేఁదలఁచుట. 34

గీ. విగ్రహమ్ములు తెచ్చిరి వెనుక వారు, అవ్వి మాకిమ్ము కోరెదమంతె సుమ్ము
అదియె పదివేలు లక్షలు ననికొనెదము, సంతసించెదమో రాజసద్గుణాఢ్య. 35

ఉ. సీతను నాతిగాఁదలచి చే కొను రావణు చేష్టమాదిరి
న్నాతిగ లోహమట్లుఁగని రాజిత విగ్రహరాజిఁ దెచ్చుట
న్నీతిని దేశధర్మమును నీటఁగలంచిరి పూర్వపాలకుల్
కోతులమూకలట్లు చనికోటజయింపవె కోర్కెఁ దీర్చికోన్. 36

గీ. అనుచు సాటిపాటు గను దెల్పు కథ విన్న, హర్ష సూచనల నెయనియె నృపతి
దైవమహిమఁ దెలుపఁ దమ్మి మ్మరుపిలువంగ, నవ్వి రాఁగ మే మిటడ్డమనుచు. 37

క. దైవములని హిందువులన, దైవము లెట్లొనటంచుఁ దామ తురష్కు
ల్వేవే పెకలించిరి కద, దైవమహత్త్వము సూపఁదగుదు మహాత్మా. 38

చ. నిగమములందు నర్థమగు నిర్గుణతత్త్వమె యంచు నెందఱో
జగతిని బల్కుచుందఱ నిజం బది కాదు పరేశుఁ డెన్నఁగా
సగుణుఁడె యంచుఁ జాటుదురు సాహసవాక్కులు వెల్లడించుమీ
తగవది మాకుఁ జూపుటకు దారియుఁ గాదె దయానిధీ గురూ. 39

మ. మునుమా పెద్దలు మెచ్చు సప్పవనిరే మాహాత్మ్యలీహింపవు
ల్వానిలేకిట్టి వివింతబొమ్మలనకే భక్తిన్సమర్చింతురో
వినవింతౌననివారె మూఢులని భావింపంగ నోఁగాదె యో
యనఘా నామనవిన్వినంగఁ దగదే యాస్థం బ్రయత్నింపవే. 40

క. కాకున్న మీరలడుగఁగ, మీకిచ్చితిమున్న గొప్పమీ కామాకా
కాకుంటనె విగ్రహములు, మీ కేకలు విన్నవి వివి వేయైనన్. 41

గీ. గౌరవంబు మీది కలకాలమందును, భక్తి యెల్లరకును బ్రబలి యొప్ప
మ్లేచ్ఛులింక మీఁద మెదలరుసిగ్గున, విగ్రహములఁ జిలుచు వెఱ వెకనుము. 42

గీ. అనుచు రాజనయోగి మెలఁచుచు లేచె, నమ్రుఁడై వినయోక్తులనతఁడుఁ గూర్చ
దీవెనలొసంగి వీడ్కొని దృఢమనమునఁ, జింత సేయుచు విడిదికిఁ జేరెనంత. 43

వ. ఇట్లు యతివరేణ్యుండరుగం బాదుషా నిజమతాభిమానులగు బంధుమిత్రుల నేక
తంబు నంగూడి తదభిమతం బెఱుంగ దలంచి విగ్రహంబులు నిచ్చుటకు సమ్మతింతు
రే యనుడు నిజమత పక్షపాతరక్తి యొంబరమతని రసనాసక్తియుం బెనం గొన
నొక్కుమ్మడినైక గ్రీవంబుగ నీనొల్ల మన్నంత వారల కాతండిట్లనియె. 44

ఉ. వీరలు గారు దాసరులు వీరలటంచుఁ దలంతురే మొకో
వారలె చాలరే తృణమె వజ్రము కాదొకో దైవమెన్నిన
న్వారిధిఁ గట్టి లంకఁ గలవారలఁ గూల్చను గోతిమూకలం
చీరలు విన్న వెన్నుఁ డెదియో శుని మాయకులొంగకుండెడిన్. 45

క. మనుజునికొనునల్లానే, ఘనముగ నాహువాణులంద్రు గాడనిహిందూ
జనులంద్రు దేవుఁడనుచును, వినవినఁగా భాష వేఱు విధమొక టెకదా. 46

క. వీరలలో నెవరైనను, వేఱగు భాషలను దెలియు వెఱ వెఱఁగినచో
వీరిది వారికి వారిది, వీరికి నిం దెలియనట్టి వెఱ్ఱులనెదరే! 47

గీ. సర్వభాషలెఱిఁగి సర్వజ్ఞుఁడననగు, సృష్టికర్తమనుజసృష్టి చేసె
కోటులొప్పఁ దెగల కూటంబులొప్పంగ, నొకటి శ్రేష్ఠమనుటయుచితమగునె? 48

గీ. రాజు నాదాయ లాభంబు రాజ్యమునకు, భంగమొదవెడు నాజికిఁ బనికివచ్చు
నిష్ఫలంబుగ జనులను నేపనేల, బొమ్మలుంచినఁ గల్గునో భూరిధనము!. 49

గీ. మతమునకుదూరంబు మతకర్తలకుఁదగుఁ బరమెకానియితరమరయఁదగద
రాజులిహపరంబులో జనుగనఁదగుఁ, గానలాభరహితకలహమేల? 50

గీ. మౌనికిన్నెయుకవిపల్కు జ్ఞానికథయు, పండితోక్తులురిత్తలేపదడౌనప్పుఁ
గానవచ్చినయతిచాల గణ్యుఁడగుట, వారితోఁగలహింపఁగవలదుమనకు. 51

వ. ఇదియెల్లనిట్లుండ. 52

ఉ. ధన్యుఁడుధాత్రినాయకుఁడు ధారుణినేలఁగమర్త్యకోటియ
న్యోన్యహితంబుసంపదయు హాయియుదంపతులింపునింపున
న్యోన్యసుఖానుకూలత లనందఘకీర్తిను సాధుముఖ్యులా
మాన్యులుతుష్టిఁబుష్టిఁగన మంచిపనుల్ఘటియించుమెప్పుగన్. 53

వ. అనునట్లుప్రజాపాలనం బొనస్చుటయుఁకదాకీర్తిఁకరంబనుచు బంధుజనంబులెల్లరు
నిరుత్తరులైన నొక్కఁడుమాత్ర మిట్లనియె. 54

గీ. అందులకెకాదెతామిచ్చినట్టియాజ్ఞ, వారిదైవంబులైనను వారిపిలుపు
విన్నఁబోవలెలేకున్నఁబిన్నపోరె, మరలవత్తురేవారలుమహితులైన?. 55

వ. అంతన్మరియొక్కరుండిట్లనియె. 56.

క బమ్మన్పుకారెగాతో, బొమ్మలెక్కసాచెలోనెబోత్రలెతమాషా
హిమ్మత్సెఆయాపన్, గమ్మత్హుయిగ్యాకు ఆనెగయహిక్మత్సబ్. 57

వ. తుదకొక్కవయోవృద్ధిట్లనియె. 58.

గీ. అయ్ఖుదావంద్తక్సీర్ఆప్కెమర్జి, జైసహైవైసకర్నెబిచార్కెంజి
దుష్మనాహోతొహిందువాదూర్ఖడింగ, కామ్ఎహ్దేఖ్నెపర్వర్దిగార్కెనామ్క

వ. అనుచుంబర్యవసానంబునఁ బ్రభువర్యుచిత్తానుసారంబుగనే కార్యంబుఘటియింపఁ
బడ దీర్మానింపంబడి యిక్కడివృత్తమిట్లుండనయ్యతివరేణ్యుండప్పతిపురప్రాంత
క్షితితలంబుననె మున్నువిడిసినయన్నెలవుననె నిర్మలమానసుండై నిష్ఠనూనియ
ష్టాక్షరీ మహామంత్రానుష్ఠానంబుసేయ. 60

క. ఆగమశాస్త్రోక్తంబగు, నాగతినిబురశ్చరణకు నారంభించెన్
రాగముభోగములుడుగుచి, రాగియతండగుటదానరహింగననయ్యెన్ 61

గీ. సెల్వపిళ్లరాయచిఱు విగ్రహముతక్క, విగ్రహంబులెల్లవెడలివచ్చె
సెల్వపిళ్లలేవఁజిటుకునఁబట్టైను, బీబికదలకుండఁబ్రీతిబలిమి. 62

గీ. ఘల్లుఘల్లుమనుచు గజ్జెలుమ్రోయంగ, నటనమొనరసల్పనాతియపుడు
చిత్రమరయుచుండఁ జెకూరెఁదటియని, తళుకుమెఱుపుభంగిఁదరలెబొమ్మ. 63

గీ. ద్వ్యతిరయంబునఁ బాయఁగాదుర్లభమయి, ద్రుక్కునిలుపఁగలేరైరి ధృతిఁ జెడిరి
ఇంతులెల్ల పనారీతిగంతులిడెడి, చంగిమేచూచుచుండిరి సకియతోను. 64

వ. అప్పుడుబీబీసాహెబా తండ్రితోఁదద్విధంబెఱుక పఱపరయంబునఁదన్మందిరంబు
నకుఁ జేరనరిగి. 65

క. చెల్లయెపుధలాహావా, భూల్లయి మేకీసెదోస్తిప్రుధ్ లీయేకోహ్
చెల్లయినాచ్తేనాచ్తే, దల్లైబత్హూ య్యామఝ్కు దేఖ్నే భేజ్జీ. 66

వ. అనివిన్నవించినవిని యాటలభ్రాంతినె యనుచున్నదనుకొనిపాదుషా 67

క. బచ్చీబేటీయెహ్క్యా; కచ్చాకామ్హైరె అపకగయెసోవుధ్యాన
పిచ్చేఘూండ్యానాకెం?, అచ్చేపుత్లాదిలాంవుఅప క్యేలే. 68

క. అంచపుడాసుతనంచియు, నంచితరత్నాళిఁ గూర్చి యట్టివెబొమ్మ
ల్గాంచనమునఁ జేయుండని, కాంచనకారులకునాజ్ఞఁగడువడినొసఁగెన్. 69

క. ఆవిధమునబీబీకై, కావించిరిన జరుగానుఘనవిగ్రహముల్
దేవియవేవియునొల్లక, రావింపఁగలేవె బొమ్మరాజవిసీరో. 70

క. అనితండ్రిఁ దూలనాడఁగఁ, దనయాఁవినుమంచుఁబలికెఁదగ వేహిందూ
జనవిగ్రహంబులేటికి?, మునివరునకధీనమయ్యె మురిసిపరుగునన్. 71

క. చనెఁగాదె మంత్రబలమునఁ, జనరాదదుగంగమరలజగడము మునెగాఁ
జనుదేరకుమ్లేచ్ఛాయను, మనవారలువిన్నఁ గడుమాటౌలోఁటౌ. 72

వ. అనుచుయుక్తాయుక్తంబు లెఱుకపఱపనాతండింతపల్కెన. 73

గీ. మంతనముఁ దెల్పసిగ్గునమాఱువల్క, లేకయుండిననదె మోదలీలయంచు
నిర్గమించెను బాదుషా నెలవునకును, అంతసంతాపమెదఁ జెందియింతినిలిచె. 74

వ. ఇచటివిషయవైచిత్ర్యంబు లిట్లుండనచ్చటయతివరుంగాంచి తచ్ఛిష్యముఖ్య
బృందంబిట్లనియె. 75

గీ. సెల్వపిళ్లై నాదచిఱు పైవరాయఁడు, జాగుసేతకేటిచందమనఘ
తురకబీబికెట్లుదొరకెనుమనదేవుఁ, డెఱుకపఱపుమయ్యయిద్ధచరిత. 76

వ. అనుచుం బ్రార్థింప వివరించె నెట్లన్న. 77

క. డిల్లీశాత్మజయయిసుమ, వల్లి పయోరాశితనయవర్ధిలుచుసం
ఫుల్లాబ్జనయనయొకతఱి, సల్లాపముగాను దండ్రిసమ్ముఖమందున్- 78

క. కావలయుబొమ్మలాటకు, మీవలనంజెఱనుబడ్డ మేలిమిబొమ్మ
ల్భావించికాంచికోరెద, తేవీలూనరింపుమిటకు దేవరప్రీతిన్. 79

గీ. అన్నఁగొమరిత కోరఁగా నాదరించి, యష్టచెఱసాలనున్నట్టియందములగు
బొమ్మలన్నింటిఁ జూపినఁ బూవుఁబోఁడి, కోరెనీబొమ్మనిమ్మనికూర్మిపేర్మి. 80

గీ. తనయకనుగల మక్కువఁదా నెఱింగి, ఆడికొనుమమ్మ బొమ్మతోననఁగ నెకొని
వందనంబాచరింపంగ వసుధనాథుఁ, డబ్జముఖిఁ బ్రేమదీవించియనిచె నాది. 81

గీ. అదియె మొదలనపాయ సఖ్యంబుకుదిరె, బీబిపద్మావతౌరమన్బిరుదునమరె
విడుచుటకునొల్లకుండిన విధమునరయ, నానుకూల్యమేయదిరహస్యంబటనఁగ. 82

గీ. మంతనంబేమిగురు వరామతముకులము, లొల్ల రావనఁదెల్లంబయొల్లకడల
నింద్యజాతిని నేస్తము వంద్యమగునె, సంశయముదీఱఁదెల్పుమోస్వామియనఁగ. 83

గీ. పావకుని కొండు నింద్యమౌనా వెలయునె, యటులె తేజోమయాత్మునికఖిలకులము.
లరయసమములు సందియమందనగునె?, కథలు దెలిపెదవినుఁడ నేకములుగలవు. 84

క. ధరణీశత్వము నొందఁగఁ, బరమపదస్థుండు పంపఁబడియెడునంచు
స్వరశాస్త్రంబులెచాటునె, చోరయగుమ్లేచ్ఛాధిపుండు దూష్యుండగునే?. 85

వ. ఇది ప్రభుత్వసామాన్య ధర్మంబుదీనికేమి?, వర్ణసాంకర్యవైచిత్ర్యంబొండు
నుడివెదవినుండు. 86

క. రామేశ్వరాభిషేకము, నీమంబుగ నేడుసార్లునిత్యంబును దాఁ
గామితఫలసిద్ధికినై, భూమీసురుఁడక్కభట్టు పొనరింపుచునే. 87

గీ. వ్రతసమాప్తిచేయు వలనది పెడఁద్రోసి, భిక్షుకై నవాంఛ బేలయగుచు
భిక్షుగౌరవముగఁ బెట్టైదరనుచింత, సన్యసించెఁజుండిసన్నుతిఁగన 88

వ. అట్టుల నేర్పడియతి గౌరవంబున భక్షింపుచు కాలంబుఁగడపుచుండ.

గీ. పాదుషాతఖ్తొకప్పుబేవార్సనైన, భద్రగజమునుగూర్చిరిబములుఁగూర్ప
నక్కభట్జీకినది వైచెనలరుదండ, తఖ్తధిష్ఠింపఁజేసిరితత్క్షణమున. 90

గీ. విచ్చుకత్తులుదూసియు వెఱఁగుపఱచి, తురకవర్ణ పువిధులను గఱపమెలఁపఁ
బట్టుదలముందుఖల్మానుపఠనకైన, యాహిలాహీతిమంత్రంబు నాస్థఁదెలుప. 91

వ. భయభక్తులు పెనంగొనఁగ నక్కభట్టు తద్వర్ణ విహితంబగు నమాజుకాలనియతిని
గు క్రైఱఁగి 'లాహిలాహిలిల్లిల్లాహ' 'యాహిలాహిలిల్లిల్లాహ' 'మహమ్మదురసూ
లిల్లాహ' అను ముఖ్యమంత్రంబులు పాసించుచు సాఖండలోపమాన భోగియైయు
నుదనియ కమనమున. 92

గీ. వర్ణసంకరంపువసుధాధిపత్యమే, యొసఁగదైవమనుచు నూహఁగొనుచు
నొప్పిఁగొన్నయట్టు లొప్పింపనెఱఁగియు, శివుఁడుస్వప్నమందుఁ జెప్పెనిట్లు. 93

గీ. వ్రతముకల్లయనెడి మతమునకొరగియు, సన్యసించితీవు సత్వరముగ
నందువలనఫలము నందితివీజన్మ, మిఱుతెఱంగులమరు నెలమిననిరె. 94

క. ధన్యతఁగననొకమతమున, మాన్యుంగానన్నునమ్మ మానవవర్య
స్వాన్వయంబున మెలపెద, నన్యాయమె సంకరమున కాస్పదమగునూ, 95

క. మీరలుభక్తులుభక్తులు. వారలునున్నాకునరయ వారయెలేదే
తీరెఱుఁగలేనజన్మము, మాజీవయష్టందునిందు మాఱుచుఁబుట్టెన్. 96

గీ. ఒంటఁబుట్టియు వేఱొంటనుంటయొవవ, సంకరంబనికొందుర జాతినీతి
మతినిబట్టియె నీకునిమ్మతముమారె, సర్వమొకటియనాకంచు సమ్మతిఁగను. 97

వ. అని యీశ్వరుండక్కభట్టు నూఁడించిన విధంబారయంగ. 98

గీ. భగవదుద్దేశ్యమునకొండుఫక్కిలేదు, ఈశ్వరునికేల వర్ణభేదేచ్ఛపాడము?
భక్తులనునిజపుత్త్రిల పగిదినరయు, మతములన్నియుఁదనకుసమ్మతములగుట. 99

వ. కించిజ్ఞులైన నరమాత్రులకె లోకవ్యవహార ప్రవర్తనంబున వర్ణంబులయొక్కయు మతంబులయొక్కయుం గట్టుపాటులకు లోఁబడియుంటవిధివిహితంబు ఇట్లనుటనె పరమార్థజ్ఞులగు మహనీయులకె యీ విచక్షణంబతచ్చిత్తాను సారంబుగ సమాదరణీయంబుకాఁదగు ననవలసె విషయమిట్లుండం బరమేశ్వరునికా యీకట్టుపాటులు? ఆతండెవండేదని వేఁడించిన ననుభవించుచునే బాసంబిలిచినఁ బలుకుచు నెటకురమ్మన్నంబోఘుచునే మొనర్పుచున్నం జేయుచుఁగోరిన భక్తుని నిద్దంపు బుద్ధికొలఁదిని ముద్దులమురియుచుఁ బద్దులదిద్దుచు సుద్దులఁదెలుపుచు నొద్దికఁ జూపుచుండువాఁడుగాన నతనికిట్టి హద్దులుండవిద్దిట్లుంతము వినుఁడు. 100

గీ. విగ్రహంబులుచిక్కను వేడబమునఁ, దఱలుగమెయున్నమరలుట తప్పదిటకు
బీబివిడనాడనేరక బేలయైన, బాధ్యతనుబట్టుమనలకై పాదుపాయె, 101

క. బలవంతులైనవారినిఁ, దలకూరిచియంపునేమొ త్వరగానలుది
కుక్కలమనలనురోయుండను, చలవారలుపట్టితేఁగ నప్పుడుమనకున్. 102

గీ. రాకతీఱునెబీబిన్నిరాకరింపఁ, దండ్రితరమౌనె? పాదుపాతలబదరుదె?
కాననిచ్చోటనిల్పుటే ఘనముమనకుఁ, బరుగులెత్తుటయాయాస పాటునకగు. 103

వ. అన్నందత్పరిజన సంఘంబదియెల్లన్విని వింతపడియున్న వారుగాన. 104

క. ఎట్టినిషిద్ధకులంబునఁ, బుట్టినసదసద్వివేక ములుగలుగంగాఁ
బట్టినధర్మసక్షిత్వము, నెట్టనవెడఁబాసిబీబి నిల్పునెకట్టా. 105

వ. అనుచు గురునాన ననుసరించి యొక్కింతకాలంబట విశ్రమింపనీకొనిరి వీరిట్లుండ నగరున బీబీసాహెబా చింతాభరంబగ్గలంబై యున్న విధంబెట్లనిన. 106

గీ. సర్వదాశయ్యవిడువదు సఖులఁగనదు, మజ్జనాదులఁదలఁపదుమాటవినదు
బొమ్మబొమ్మంచు నొకస్మరణమ్మెతక్క, మాఱుపల్కులులేవాయె మఱపులేదు.

గీ. దాదియేమమ్మ దీనికిఁదగినయుక్తి, నరయఁజుంటివటంచు నయ్యతివలనఁగ
దాదిశయ్యాసమీప భూస్థలినినిలిచి, తాల్మిబోధించెనిట్లనితరుణితోడ. 108

గీ. చింతపనియేమి?నీకింతవంతయేల?, వింతగాఁదోఁచునిదియేటిమంతనంబొ
ప్రాణపదమైననాతోడఁ బలుకకుంద్రె?, మర్మముంచకతెల్పవేమధురవాణి. 109

గీ. పక్షిపిల్లలు ఱెక్కలు వచ్చుదనుకఁ, దల్లి వదలవీఁకటుమీఁదఁదరలిపోవు
నటులెయౌవనమొదవఁగనతివలెల్లఁ, బ్రాణసఖులనువిడుతురు పతులఁగదిసి. 110

గీ. ఐననీకింకవరుఁడంచు నమరలేదు, చేతనమెకానిబొమ్మకీచింతతగునె?
ఖళిఖళీయద్భుతం బయ్యెబాగుబాగు, కారణముఁదెల్పఁగదవమ్మకరుణయుంచి. 111

క. నానాఁటికిఁదనుకార్శ్యము, నూనంబుగఁగల్గుచుండ నోర్చుటయెట్లో
దానికిఁదగునుపచారముఁ,బూనకమేమున్నతఱిని భూపతికన్నన్. 112

క. బహునిందాభూయిష్ఠత, బహులీబర్తుఫలకును పాత్రులముగమా
కహహామోసమొనర్చితి, శహబాసురెబీబినీకు సమ్మతమగునే?. 113

క. తలఁగట్టియొదిగిలంబడఁ, దలఁపులవోనగూడనగునె తరుణీమణిరో
వలసినపనులనుజేయఁగ, ఫలమొనరునుదైవ ఘటనపనుపడుకొలఁదిన్. 114

ఉ. ఎవ్వఁడురాణివాసమున కెత్తెఱవచ్చెనువచ్చినంతనీ
వెవ్వనిరూపుఁగాంచి మనసీయఁగనొప్పి తొనీలవేణినీ
కెవ్విధిభ్రాంతికద్దొతలఁపింత యొఱుంగఁగఁజాలమింకనీ
వెవ్వనిడెందమందునిచి యింతఘటింతొ వచింతెయింతిరో. 115

గీ. పోతుటీఁగజంకుఁ బోరానుబహరాల, నబ్ధిలంఘనంబునతిశయించు
నిట్టిచోటఁజొరఁగ నీశ్వరుండేయగు, నరునకగునెతెలుపు తరుణియనుచు. 116

క. దూషణభూషణమిషలను, భాషించినదాదిఁగాంచి బహాదర్పావ్యరీ
ఆపక్యేరీసఖ్ఖీ, క్యాపక్ హైగేవోహీచ్ కామనిపలికెన్. 117

గీ. వృద్ధనారిపతివ్రత వినుతిఁబడయ, యౌవనావస్థలన్నియుయాదిమఱచి
నీకుఁదగునటె నన్నిట్లునిందచేయ, జేతనాచేతనముచేతఁజెప్పవలెనె?. 118

వ. అనియనునంతనెదద్దరిల్లియాపెద్దముద్దియయ్యల్లముద్దుముద్దియసుద్దులకొద్దికపఁడ.119

గీ. తెల్పఁగదవమ్మ యాగూఢదివ్యచరిత, మేయుగంబందు నెవ్వరునెఱుఁగఁబోరు
బొమ్మయంచునెయే మెల్లనమ్మియుంటి, మింతయేకానియితరమే మెన్నఁగలము?.

వ. అనుచుదాపునకుఁ జేరికురులుచక్కదిద్దుచుఁ గూర్మినెఱపుచువినబీబియిట్లనె. 121

గీ. ఆత్మవాంఛనెక్కె కొన్నయాటబొమ్మ, బాల్యముంగోలె నాజంటఁ బాయకుండ
యౌవనాంకురితాంగినై యలరునపుడు, మేనిస్పర్శంబదొక్కింత కానరయ్యె. 122
గీ. అలగజోదర్శనోత్సవ మైననాఁడు, పేరటాండ్రెల్లఁ గూడియుఁ గూరిమిబహు
శుభములొనరిచి యిడిరిగా శుద్ధజలక, మదియె మొదలుగఁ బ్రతిరేయి ముదమొదవఁగ.
మ. జలకంబాడిననాఁటిరాత్రి నెవరీశయ్యం బ్రతిష్ఠించిరో
చలనంబింతయులేని విగ్రహముచంచత్కాంతితో నొప్పుచుం
దలఁగన్నేవఁగడిగ్గఁగంటిమదనాస్త్రవ్రాతపాతవ్యథా
కలితన్నన్నొసరించురూపమిఁకఁ బైఁ గన్పట్టెవింతైకనన్. 124
క. కులశీలవివేకంబులఁ, దొలఁగకనరులందునిలుచు దుర్భరమదన
జ్వాలనముసర్వాంగంబుల, నెలకొనదటె దాకొనంగ నిలువంగలరే! 125
క. కనులకుమిఱుమిట్లొనరిచి, కనుపూసియుఁ దెఱచునంతఁ గన్పడబొమ్మై
ననవిల్తుఁడోల సెమనమున, ఘనమగుమోహంబుమీఱెఁ గళవళపఱచెన్. 126
వ. అంతం బ్రపంచంబు మఱచి సిగ్గువిడిచి భయంబునడఁచి యలబొమ్మ నాపాన్పునఁ బవళించియుండ నేనాదటి నిలిచియుంటిఁ గానఁ జేతులుమోడ్చి జోహారొనర్చి నే కన్నరూపము నుద్దేశించియది పొడముకారణంబగు విగ్రహంబుం గనులఁ జూచుచు నిట్లంటి.
గీ. విభవయుతరూపమునుదాల్చి విమలచరిత, యన్యరూపముధరియించు టవసరంబె?
మరులుకొల్పుచుముగ్ధకు మదిఁగలఁగఁగ, మాయమైతేటి మర్యాదమోయధీశ.
గీ. మోహనాకారలేలెమ్ము సాహసాంక, నీదునిజరూపము నెతొల్పు నిరుపమాన
నీయధీనంబ నామేను నిశ్చయముగ, సంశయంబేల డాగంగ సరగరాఁగ 129
గీ. మానవతినేకతంబున మనసుకరుగఁ, గనినపురుషోత్తమా నీవ కావెపతివి?
కానుపింపకయుండినఁ గార్యమున్నె?, ఆదుకొనినిల్పుమిఁకమీఁద నాదుమేను.
మ. వచనన్నావరనాదెసన్నిలువరా వాంఛించియున్నానురా
దరహాసాంచితమైననీమొగమునం దమ్మిక్షైకన్నానురా
వరవక్షోజయుగంబునీయురముపై వ్రాలంగనుంకించులే
వరజాగేలరయేలరాచిఱుదొరా పైకోరఁబైఁగోరలే, 131
వ. అని యేనువలచి యడుగ. 132
చ. కనుఁగొనవింతరూపమది కానఁగనయ్యెను విగ్రహంబునం
దనువుగఁబుట్టెసంభ్రమము యారెవిలాసఁపురీవినై ఖరు
లక్కనులకుఁబందువయ్యెనిజ కాంతునిఁగా నెదనమ్మిభీతివో
మనసునుజక్కఁజేసికొని మక్కువనెక్కొనఁ గాంచితింగదే. (అంత) 133

పంచచామరము.

జమీన్పరాగహైసాలోగ్ నమ్మన్యాభిసాధువా
తుమారనామ్ధ్యాన్ కీ యెతోజబీచ్ పాలెనా
తుమామ్పండితాకహింగతప్కె వై సహీఅబీచ్
హమారెపర్ ఇనాయతాప్కె ఆయిసామ్నెఖడ్గయే. (అనుచు మొదలిడి) 134

చ. శ్రుతిహితరాగమెంతయును సొంపుఘటింపఁగ షడ్జమందరా
తతమృదునాదసంగతిని దానముగాబహుతాళయుక్తిగా
నతులవిలాససన్నుతుల కాస్పదమౌనయకీర్తనంబుల
న్నతినుతిసల్పసాగితి మనంబుననాతఁడువొంగిలొంగఁగన్. 136

క. కావేరీతీరమ్మున, నావలెనేచూడుకుడుత, నాంచారంబ
న్నాభవించురాజమన్నా, రావేగమరావెయంటి రహిఁబైకొనఁగన్. 136

క. ఏనట్లనలేనగవున, మానినిమరుదీపకళిక మత్ప్రాణసఖీ
దీనతమానవెనిన్నిక, నానాపీడంగనాకు ననిచేఁబట్టెన్. 137

చ. అనుచునెయింకదివ్యమగు నాకృతియేమదొ చూపినంతనేఁ
గనుఁగొనఁజాలలేమిఁదగెఁ గందళితాంతర విభ్రమంబుతో
ఘనతరఘర్మబిందువులఁ గాంచిభయంబుడుపంగఁజేరర
మ్మనిపురులిట్టినక్కనిడ నాగితినంతవికారమేగఁగన్. 138

మ. స్మరతాపంబదిమీఱెనొక్కొయనుచు న్సయ్యాటమం దార్పనుం
గరమాహ్లాదముఁగూర్పమేనుగది యంగావామపార్శ్వాంకమం
దిదవొందన్నను జేర్చిచన్నుగవపై నిట్టట్టుహారంబుల
న్సరితీర్పంబనిఁగొన్నరీతిఁగననే సైపంగనిట్లంటినే. 139

గీ. తాళుమోనాథపరిణయ తరుణమెకద, తరుణికోరికమాలోనఁ దప్పదింక
నందఱటిఁగినపాణి గ్రహణమెమేలు, శాస్త్రగణ్యంబుఁ గావున శంకజనదు. 140

వ. అనియేనన్ననమ్మోయలమారిమనోహరుండునన్నుంబేలఁజేసిమాటలను గుపఱచుచు.

గీ. అహహ! యేమంటివి? పరిణయమదియె? కాదు, దంపతులుకూర్మి సాక్షిగనింపనిదియె
ఒరులొనర్చినమనసుల కొప్పుటెట్లు?, తలఁపగాంధర్వమే మేలుతరుణిమొప్రు. 142

గీ. పంచభూతచయంబయాఁ బరమసాక్షు, లంచునమ్మముసందియామందఁగనకొ
మంచుబాసలనేకంబుల మరసల్పి, కేళికొనఁగూర్చెపే యేలకేలువట్టె 143

గీ. ధీరమతినాచులజ్జనుదారవోసి. నిరుపమానంద కేళిలోనెగడఁగనితి
వేగుజామునవిగ్రహావేషుఁడయ్యె, సతతమిట్టులెనేస్తపుఁ జందములరె. 144

గీ. తలపకయెయ్యంటినుద్వాహతంత్రమెపుడు, సతమయనికొంటినమ్మ చాసఖునిప్రాపు
దానసలకోడు విశ్లేషమాసఁజేసె, కార్యమిట్లెటులౌనొ సఖీకలనా వెలుఁగ. 145

వ. అనినవిస్తరంబుగా నుడివినగాథ నరిత్రంబునకు నత్యంతవిస్మయాకులిత చిత్త
దైన్యగా వినుచుండిన సఖీజనంబులుం దమలోనిట్లని వితర్కించిరి. 146

గీ. హిందువులు విగ్రహంబులయందుదేవుఁ, డున్నయట్లెంచు నర్చింతురున్న విధము
మనకుఁదెల్లం బెకద యిష్టవనజగంధి, పొందుచున్నట్టి తాపంపుఁ బుట్టువెలుఁగ.

క. వేషముభావముఁగనుఁగొనఁ, బ్రోషితభర్తృకయె యనఁగఁబొందికతగన
వ్యాసామాషీల్వలద, న్వేషింపఁగవలయుబొమ్మవిధ మెట్లోకో. 148

క. దాసన్లకుగురుడంటే, భూసురుఁడంచేయిపెత్తి భూపతినడుగం
గాసరియన్నారంటయు, పాసించెనటంటయేదొ పరువిడెబొమ్మల్. 149

గీ. మాయలాఁడుజోగి మనబీబిబొమ్మైన, నొక్కటిచ్చునేని క్రొమొక్కవచ్చు
నింతసేసెమీఁదనింకెంత చేయునో, అటికేగుమెట్టులడుగుమెట్లో?. 150

మ. మనమెవ్వారిననంగవచ్చునిఁకనమ్మా యామయుండీశ్వరుం
డనురాగంబుఘటించి బీబినిటులన్వ్యామోహవారాశిలో
మునుగంద్రోసిమునీంద్రుపిల్వవిననేముండేగనాయంబిదే
యనిమోకొండొకరీతిఁదాఁదలఁచిమో యద్దెన్న నేరోర్తురే?. 151

క. మనమేయనువునుగానము, మనతరమాసంధిఁ గూర్పమానినిదేశ్వ
న్వినితిమెవిందుమెయొందును, గనుఁగొనఁగనమానుషంపుఁ గథయిదికాదే?. 152

గీ. సంధికుదురుదనుక జక్కనఁబడదిది, అద్దికూర్పునకునలవికాదు
ఎవ్వాహులశక్తిపల్కులవియివిపల్కుచుఁ, బ్రొద్దుజరుపఁబనులు పొందువడును. 153

వ. అనిక్రృతనిశ్చయలై వాదంబుమెట్టించి భేదంబుబుట్టించి ఖేదంబునెట్టించునేర్పున
నాదేవితోదాది యిట్లనియె. 154

క. సుకృతీయావనమమరిన, మదినెప్పుడుబొమ్మకాంచి మక్కువపడుటం
గదిసెనుస్వప్నభ్రాంతిగ, నిదినిజమావిన్నవార లెదనమ్ముదురే?. 155

గీ. నమ్మకందురుమతి చలనమ్మటంచు, నిజమయందేనినాథుండు నినుమఱచునె?
వానిసామర్థ్యమెఱిఁగితి వగవనేల?, తాళుమొక్కింత తరుణముతానెవచ్చు. 156

క. యాతులగృహస్థులఁజేసెడు, మతిమంతుఁడుసుప్రసిద్ధ మదనుఁడెఱుఁగవే?
సతిపతులఁగూర్పనేర్పరి, యతనింబూజింపవమ్మ యనుకూలంబౌ. 157

గీ. వనవిహారంబుమదిగల వనఁటఁబాపు, నందుననవిల్తుపరివార మలరుచుండు
అతఁడనంగుఁడువసియించు నటనెనిజము, వేఁగఁబూజింపు మగనినిలోఁగఁజేయు.

గీ. దాపియోజననిజమని తలంచినంత. నూచెందలమెల్లగా దానిసూచనంగని
ప్రీతినమరిచిముక్కలిపీటబీబి, దానఁగూర్చుండ సంపంగినూనెయంటి, 159

క. పన్నీటజలకమార్చియు, సన్నంపుంబేష్వాజుందొడిగి శాలువయోణీ
వన్నెగవైచియురతనా, లెన్నియొకలభూషణము లనిడిరివడివడిన్. 160

గీ. కాంతిమేనిదెమిఋమిట్లు కలుగఁజేయు, నగలనిగనిగయును మిక్కిలిగనెసంగు
సరిగెపట్టుల జమిలిదౌసన్నపచ్చ, డంబుముసుంగిడంబడిసె నాడంబునాప. 161

వ. అట్టియెడనారాజ కుమారి. 162

క. కలవేల్పులారజోహా, రెలమిన్మదిఁగల్గు కార్యమీడేర్పుండీ
కలవరపాటిఁకమాన్పుఁడి, తలఁతున్హృదినంచు భక్తి దండము పెట్టెన్. 163

క. బుజుర్గ్ లోగాకహ్నె, బజనాబ్ సఆదత్తై సె ఖాతాకుఫ్ సై
నజికర్కెన్నెసకుంగీ, హజరత్ ఆదాబ్మహమ్మదాహ్నె కుమిలా. 164

వ. అనియిట్లనేకవిధంబుల నిష్టదేవతాభివందనంబు లొనరింప. 165

గీ. భోజనపదార్థములనెల్లఁ బొందుపఱచి, వనవిహారమ్మునకు ముందిపను వేకా దె?,
అమ్మవేవేగ రాగదవమ్మయనుచు, బుజ్జగించిరితగునట్లుప్రొద్దుగడప. 166

క. వీణయుఁజితారుతాంబుర, జాణలుచేఁబూనిశ్రుతులు జతపఱచియునా
వాణీతాండవకేళికి, నాణెంబగుతీవిఁ బాడనబోడివినెన్. 167

క. తబలామృదంగసాజుల, నబలలువల్కింప సాగిరదిసతివినఁగ
న్నబురోసబురోబీబీ, ఖబరచ సున్సబ్ ఖుషీకెకాహ్నాగానాన్ 168

వ. ఇట్లాయింతులాదంతి గమననొక్కింతసంతసంపుఁబొంతకుమరలించియంతన్వనవిహారగమనోద్యమంబునఁద దనుకూలసన్నాహంబున వెడలనాపెవలన నెలవందుటయు.

క. శ్రీగోపికుచకుట్మల, భాగోజ్వలగంధసిక్త భాసురవక్షా
గోగణగోపీమోదద, రాగాలాపనవినోదరాజీవాక్షా. 170

మాలిని. సరసిజదళనేత్రా శంకరప్రాణమిత్రా, హరిపదమపవిత్రా అంబుదప్రాయగాత్రా
వరదవిమలనామా వైరిదైత్యాళిభీమా, తరళితముఖసోమా ధైర్యగాంభీర్యధామా.

గద్య. ఇదిశ్రీహేమపాలసగోత్రకామిసెట్టివంశపవిత్ర శ్రీవేంకట
దాసపుత్రపేరమదొరాఖ్యసుకవిమిత్ర
ప్రణీతంబయిన యాదవాద్రీశో
పాఖ్యానంబునందుం
బ్రథమాశ్వాసము.

---

# ద్వితీయాశ్వాసము.



క. శ్రీవిశ్వనాథమిత్రా, శ్రీవాణీశాదివినుత శ్రీవత్సాంకా
శ్రీవరశ్రితజనవరదా, పావనశ్రీవేణుగోపబాలసుశీలా. 1

వ. అవధరింపు మవ్వలి వృత్తాంతం బెట్టులన్న. 2

క. సెలవందియపుడ వేగమ, చెలులందఱుఁ దమకునున్న చిత్రపదార్థం
బులు చేఁగొని పెడతెరువున, నలరింతము సఖినటు నెదునాసక్తిమెయిన్. 3

క. ఆరామవిహారమునకు, నారీమణులెల్ల నిల్చి నగుమొగములతో
వారిజవిలసత్కాసా, రారామముఁ జూడఁబడమె యమ్మా యంచున్. 4

గీ. పంచశరుపూజనొనరించు పనిగలదట, కేగవలె వేగ నిఁక జాగు దేలయంచు
కదమ్తై హుయ్ఫర్మాయియ్యె కామ్హుక్కా, మాయినాఁగ నెబీబి సమ్మతమునొంది. 5

సీ. ఖీన్ఖాపుఫేష్వాజు కెందామరలనిగ్గు పైకుచ్చు కింజల్కపటిమనొప్ప
నెటిబనారస్ఓణిఁ బరగుజరినజుసుమపల్లవభ్రాంతినమరఁజేయ
పాపఁటబిందీలబహురత్నములు ముఖచంద్రుసన్నిధి నుడుసమితిఁగదగ
మణిఖచితసువర్ణమయమగు కీల్జడవెనుబడ్డి రాహువుననుకరింప.

తే-గీ. తళుకుపై జార్లుపాం జేబులొలసి మెఱయ, గౌనుపింజెలకట్టు గంతులిడఁగ
గౌనునసియాడమదహంసగమనమునను, బ్రీతినుద్యానకేళికి బీబివెడలె. 6

మత్తకోకిల. మంజుకుంజలతాగృహంబుల మాలతీకుసుమాదులు
స్సంజవేళకువిచ్చుకుట్మలజాలము ల్రమణీయము
ల్పొంజుళాగరుజాతులుంగడు వన్నెకెక్కినమల్లెలు
న్రంజిలంగనవచ్చిరప్డుకురంగనేత్రలు వేడుకన్. 7

సీ. చందనపిచుమందమందారఖర్జూరనారికేళ మధూకసారసములు
జంబీరమాధవీచంపకతక్కోలమాతులుంగలవంగకేతకులును
భల్లాతకీశింశుపపలాశచూతనాగామ్లాతపున్నాగహల్లకములు
కందరాళశిరీషకదళీకదంబకకుందనింబాశోకకురవకములు.

తే-గీ. సారిదిరాజిల్లఁగా వాని సురభిఁబూని, మారుతము సేరఁగా సారనీరమలర
శుకపికారావముల తీవిసొంపునింప, వేదనం బాయనాచాయ వెలసెబీబి. 8

చ. సకలచరాచరప్రసరచారువసంతమదాటనచ్ఛట
న్వికసితచంపకోద్గమనవీనసమీరవిలాసవైఖరు

ల్సికపికనాదసంకులపుఁ బోద్యమునొక్కఁటఁగో చరింపఁగా
నకటవియోగినీజనులకాదరు వొప్పునెయెట్టులెంచినన్. 9

గీ. పిత్తమెచ్చినమధురంబు వెగటుగుగతి, విరహిణులకు వసంతపువేడబమున
బాధకములయ్యె గంధానిలాదికములు, ఆపదనువిషమగుఁగదయమృతమెన్న. 10

గీ. ఉవిదతాళకసోలుచు నున్నదెటేఁగి, చెలులుపువ్వుఫలాదులుసేకరింప
నోర్చిమన్మథునకు షోడశోపచార, పూజలొనరించి కేల్మోడ్చిపొగడెనిట్లు. 11

క. స్మరనీకును మ్రొక్కెదరా, పరిపరివిధములననిన్నుఁ బ్రార్థించెదరా
బిరబిరనను నాధునిఁగూ, ర్పరనిత్యానందనిలయ పదరాగదరా. 12

క. మన్మేరిచురాయాహై, పన్మేరఝుక్కాభూల్గయారె 'పాప్ బిచారీ
జన్మహరాజాపక్కాయె, హ్దిన్మెర్ఝుభేజీ' కహారెదిల్వలతారే. 13

వ. అనుచు మన్మథుం బ్రేరేపించుచు బీబీసాహెబాయుండె. 14

ఉ. అంతటసెల్వపిళ్ళమది కాయమనామముజ్ఞప్తిరాఁగఁదా
మంతనమందుఁబల్కినది మాయలటంచుఁ దలంచిప్రీతితో
నెంతవిచారమొందెడినో యేఁజనఁగావలె నంచునాత్మలోఁ
జింతనసేయనేవిహగ శేఖరుఁడప్పుడ మ్రోలనిల్చినన్. 15

వ. అప్పట్టున నొప్పంగల విషయవైచిత్ర్యంబు లెఱింగి కర్తవ్యంబాలోచింతమనికొని
ముందిట్లనియె. 16

గీ. నాదువిశ్లేషమునకోడి నర్మపుదశ, బీబినాంచారిసంతాప భీతులఁబడి
మఱచితినటంచునన్నను మనమునందు, వనరుచున్నాఁడుఁదడవాయెవైనతేయ. 17

గీ. నర్మసఖుఁడవుతగుదువు మర్మమెఱుఁగ, నొరులకలవియెయటకేఁగ వెఱవొనరునె
దూతకార్యంబయైనను నాతికడకు, నిన్నెపంపఁగఁదలఁచితి మిన్నవగుట. 18

గీ. నీవటుద్యానవనమున నిలిచికనుము, వారువిహరింపవత్తురు వలనదెయ్యగు
స్త్రీలకోర్కెయెవారిలోఁ జెల్లుఁగాన, పరిణయోద్యమమునకు నేర్పుఱచిరమ్ము. 19

వ. అని నిజనాథుండు పనుప గరుత్మంతుండు నమస్కరించి. 20

గీ. భాగ్యమంచును వేంచేసి భవ్యమైన, తోఁటలోననుజాటుగాఁదొలఁగినిల్వ
నొక్కపాదరింటిమాటున నున్నతఱిని, బీబివిహరింపనటువచ్చి వీలుగుదిరె. 21

## ద్విపద.

శుకశారికావళి సొంపునీక్షించి, పికనాదమెంతయుఁ బ్రీతినాలించి
రాజహంసలకొప్పు రామణీయకము, నోజకేకులకొప్పు నొప్పిదంబరసి

కోరికగిజిగాని గూడుల మెచ్చి, సారంగములయీల సారస్యమరసె
పక్షులొండొంటిని బాయకయుండు, లక్షణమీక్షింప లావణ్యమరులు. 22

గీ, అతులశృంగారవనవీథు లందుఁజనుచు, లతలురతనాలవన్నెల వితముసఁదగ
విరిసియుండినవైఖరి వింతనీసఁ, బుష్పాదులనిండియుండిన పొదఁగనెఁగద. 23

గీ. అవురువాటునఁబోదరింట నగబడియెను, నరుఁడొ దేవుఁడొ ఖగరాజొ నొయుకపడదు
అతులవిభ్రాంతినందు చయ్యతివలెల్ల, నదబుగదియించియాదాబ్ హజ్రతనిరి. 24

గీ. బీబిదైవజ్ఞ కావున భీతిలేక, గడగడవడంకుపడఁతులఁ గడకుఁద్రోసి
ముందునకువచ్చి తానును బందెగియని, యెట్టియెదురుగఁదానుండి యిట్టునిలచె.

క. పరులెవ్వరు రాఁగూడదె, పురుషుండవునీకిటెట్టు పోసఁగెను రాఁగా
నరఖగరూపము లొప్పెడిఁ, గరమాశ్చర్యంబిదేమి గారడిచెపుమా. 26

క. ఎవ్వరివాఁడవునీ వే, రెవ్వర్ణంబులనుగూర్చ నేర్పదునిటకీ
వెవ్వరుపనుపఁగవచ్చితి, వవ్విధమంతయును దెల్ప నగు వేనాఁగాక. 27

గీ. యాదవాద్రీశభృత్యుండ నాదుఁదల్లి, గరుడుఁడను పేరఁబరగుదుఁ గాంతునతఁడు
నీదుసేమంబుఁ దెలిసెడి యాదరమునఁ, బిలిచియంపఁగవచ్చితి బీబియిటకు. 28

క. ఆతఁడులోకాతీతుం, డాతఁడు సర్వేశ్వరుండు హరహితుఁడమలుం
డోతల్లి నీపయింగల, ప్రీతిన్నిన్నాదరింపఁ బ్రియపడియున్నాఁడే. 29

క. తనుబాయునీవుమనమున, వనటంబొందెదవుగాన వలపని దెల్పం
బనులింకఁ గొన్ని చెప్పను, ననుఁబంచెను జనని బీబి నాంచారియనన్. 30

క. ఓహో నేఁడుసుదినమా, యూహన్నెయాదిరాక యెుదవినదొక్కో
మోహా వేశపుభ్రాంతులి, వాహానిల్కడనుబొందు టద్భుతముకదా. 31

గీ. అయ్యతనమీఁదిభ్రాంతినా హారమెఱుఁగ, నిద్దురెఱుఁగను బ్రాణముల్నిలిచెనెట్లొ
బొందిమాత్రమెకాన్పించుఁ బొందికచెడి, సాక్ష్యమీయదెయంగకార్శ్యంబనీకు.

క. నన్నిట్లువిడిచియేగుట, మిన్నంచును జెప్పుచుంటి మీప్రభువునకే
యెన్నికనాయమె చెప్పుమ, తన్నే నమ్మినను జులుక తనమొనరుతురే?. 33

గీ. అబలయిదినన్ను నేపాటి హానిఁగూర్చ, ప్రబలుఁడాతండు దాసర్ల ప్రభుఁడుపిలిచెఁ
బోదమంచు నెపరువిడు మోదమెకనె, తగునె నాఁగనెయిట్లనె ఖగవిభుండు. 34

గీ. అబలవెట్లౌదు నీవు క్షీరాబ్ధికన్య, కళను బుట్టితి బీబిగాఁ గాననెహరి
నిన్ను వరియించె మనసిచ్చినన్నుఁ బనిచె, నింక నేటికిమాను కళంకమమ్మ. 35

క. అనఁగవినిబీబియిట్లను, ఘనుఁడాతండా యెమీరు కలభృత్యులుగా
నొనగూడినార లైతిరి, ఘనతకులోటొనటుంచుఁ గమ్మదురుగదా. 36

గీ. అంతరంగదూతవై ననునీతోడ, నంతయేల చెప్పనతఁడు తాను
ఎంతలాడకున్న నింతలోఁ బనివట్టి, నిన్నుఁ బంపునయ్య? నిజమెఱుఁగుము. 37

క. గాంధర్వమేలనిక్కపు, బంధుత్వముఁ గూర్తురన్న భంగపఱచె సం
బంధమె యనువుగ నుండిన, బంధింపక విడుతు నెతనుఁ బైటచెఱఁగునన్? 38

గీ. బూటకపువాక్కటంచును మున్నె తెఁగినఁ, గూటమునకేల యొప్పదుఁ గోరినటుల
సాటివారలలో నగుబాటొనర్చి, దాటియేగుచు నన్నేల తలఁచెదరల? 39

క. కాదమ్మ మనవి నివినఁ గాఁదగు మేల్గలదటంచు ఖగపతియన్నం
బాదుకొనియున్న కిన్కను, దా దేవియు యిట్టులనియెఁ దగవెతఁగింపన్. 40

క. తానెవ్వఁడొ యేనెఱుఁగను, కానంగా వచ్చెఁ దానె కౌఁగిటఁ జేర్చెం
దా నేమరలు నముంచెను, దా నేనన్నిట్లు వీడఁదగవా ఖగపా. 41

క. ఏమియెఱుంగని ముగ్ధకు, నేమేమియొ నేర్పి తెలిసి యెచ్చటికకు రా
నీ మెయి మోసము చేయుట, తా మున్నె తెఁగినను డింపఁదగవా ఖగపా. 42

క. మాతండ్రితోడఁ జెప్పెద, నీతంబుగఁ బెండ్లియగును నిర్బాధకమా
నాతుఁడపడకనవినకపు, డా తెఱఁగునఁ గూడెఁ దగవదగునా ఖగపా. 43

క. తానిప్పుడపుడు దొంగగు, నానీమంబునకెనన్ను నలవఱచె వెసఁ
దా నేగ నేనెటేగఁగ, నానోయీ చెప్పుతగవి దగునా ఖగపా. 44

క. బాసలు పెడఁగాఁ ద్రోసియు, మోసంబుగ నన్ను ముగ్ధ ముప్పులఁ బెట్టం
బాసియు గంతుల్వేసియు, దాసుఁడు పిలువంగఁ బఱుగు తగవా ఖగపా. 45

గీ. ఇవ్వియన్నియుంచి యిప్పటి నాగతిఁ, జెప్పికొందమన్న సిగ్గటుండ,
నమ్మరై రెచెలులు బొమ్మతో పొత్తంట, బీబి కట్లొ పుట్టెఁ బిచ్చియండె? 46

క. నీవు మహాత్ముఁడవౌదా దేవుని గుత్తెఱఁగినట్టి ధీనిధివగుట
న్నా వెతలన్నియు నేఁడే, యే వాకొనితింతకాలమేమని యెఱుఁగన్. 47

వ. అనియనియొక్కింతయూరకున్న నా దేవితో విహగేంద్రుఁడిట్లని విన్నవించె. 48

గీ. ఐనదేటికిఁ దలపఁ గానఖిలజనని, ముందుఁ దానిన్నుఁ బరిణయమునవరింప
నున్న మా ప్రభుఁడది మీకు విన్నవించి, యత్నమొనరింపుఁడని తెల్పనని చెనన్ను. 49

క. అనియాతండనఁగా విని, మనమున సంతోష మొదవ మఱలింకెదుగ
న్వినతాతనయునకనియెను, మనవిగ నొకమాటఁ దెల్పుమన్నాధునకున్. 50

గీ. ఇపుడు మొదలిడి పరిణయమేర్పడంగఁ, దగినయారాయ భారముద్ధరణిపతికి
యుభిపతికైనసెప్పడో జతపడుఁగద, తాళలేనింక క్షణమైనఁ దన్నుఁగనక. 51

క. కావునఁ దొల్లిఁటియట్టులె, తావకసన్నిధినిఁ గోరుఁ దరుణి యటంచు
న్నా విభునకెఱుకపఱుపుము, నే వేఁ జేయింతుఁ బెండ్లి నిర్ణయమంతన్.
గీ. ముందునాకుఁ జెలుల ముంగలఁ దలయెత్తఁ, దగినదీవి యొకటి దారి వెట్టి
నిప్పుడున్న తొప్పు మెచ్చుడిగినఁ గాక, సాగునానఁ గూర్పునాతరంబె?. 53
క. అనియనగరుడుండనియెను, జననీ నీపలుకు మిగుల సరసంబగుట
న్జనకునకుమనవి చేసెదఁ, బని విని యెదనతఁడు నీదు పలుకే నెఱపున్. 54
వ. అనిలేచి గమనోన్ముఖుఁడయిన బీబిమకరలనిట్లనియె. 55
గీ. పోవుచున్న ప్రాణమీ వేళకుమనిల్ప, నిన్నుఁ బంపినట్టి నీతమెయను
తానిటెంక రాకతడవొనరించినఁ, బోకమానదవల రాకుమనుము. 56
వ. అనఁగ విని ఖగపతియవ్వా యంతటిమాటలేలయి దెటివ్వనఁ బోయి యంతయు విన్న
వించి నీచింతమాన్పెదునని యంతలో నదృశ్యుండయ్యె నంతవిప్పారియున్న ముఖార
విందంబొప్పనప్పుడంతిం బొడఁగని చెలికత్తియలిట్లనిరి. 57
గీ. అంగజుని పూజ ఫలియించి యమరెఁ గూర్మి, నీ ముఖంబిదెకళ మీఱి నిర్మలమయి
శుద్ధరాకాశశాంకుని శోభనొందెఁ, దావకాంగము లావణ్య ధామమయ్యె. 58
గీ. అంచ సౌఖంబుఁ జేర్చి రాహంసయాన, విభుని రాకకు ముదిలోన వివిధగతుల
యోజనలు మెండుగాఁ జేయుచున్న తఱిని, జెలియలిట్లనసాగిరి చిత్తమరయ. 59
క. పుతలాకినుక పఘానత్, సుతరేగీసాదికైస? ఝూట్హోగీమా
సుతరాకెబిచారహ్నాబ్, జతనపెన్నెరివాజెక్కకెక్క జల్ది హుకుండే. 60
క. అననే బేఖూబనుచును, మనమున రోషించి లేచి మగూర్గ్లోగా
సునెభీ అహ్వాలెతేన్నె, మెనహోగా కామ్కహ్నా మేక్యాయనియన్. 61
క. కదరకుఁడీ చెలులారా, సదయునితో సాటియెవరు సర్వంసహాలోఁ
గుదురుచునంతయతండే, కద సృష్టిస్థితిలయముల కారణుఁడగుటన్. 62
క. హాఁయాకలి గొనునంతనె, బిరబిరపరువెత్తి యొక్క పిల్లినములునే?
పరువుగగర్జింపుచుఁగరి, శిరమునమస్తిష్కమిచ్చఁ జేకొనెడిఁ గదా. 63
గీ. బొమ్మతక్కవదంచును బుద్ధిలేక, మున్ను పల్కినఁ జెల్లును గన్నులార
భక్తుఁడటు పిల్వ నేగిన ఫక్కిఁ గాంచి, దైవమను చేరెఱుంగరు? దానిఁబట్టి. 64
క. మాతండ్రి మాపినాహాము, చేతస్సంప్రీతిఁ జేయు సిరులొనగూడు
నీమ్రతప్పు బలుకులిఁక పై, నాతో ననఁబూను చెడుగు నడతలుడుగుఁడా. 65
వ. అని వారలఁ గసరికొని పుచ్చి తదేకధ్యానమున దారికై యే చూచుచున్నంతనక్క
డఁ దన యేలికయగు మేలుకోటనాయకు మోలిగరుత్మంతుండు వాలి. 66



క. అడియేన్దాసుఁడనంచును, వడిసాగిలి మ్రొక్కియనియె వనజదళాక్షా
పడఁతియొకనిముసమాఁగదు, కడువడిఁబై గార్యమరయఁ గాఁదగు నెమ్మిన్. 67

క. అనిదూత విన్నవింపఁగ, మనమున నిశ్చయమదంచు మాకుందోచెం
జనదింక జాగుచేయుట, వినుమా సంకల్ప మొకటి విహాగాధీశా. 68

గీ. పూను కామరూప పుష్పకాకృతి వేఁగ, రామసౌధమునకు రాను బోను
కత్తియింతివట్టు ఘనముగఁబడియుండు, వింతక్రీడసల్పి వెతలుడుపుదు. 69

న. నారాకచిహ్నఁ జెలిపెడు నీరాకకు నెదురుచూచునీ వరిగియునా
నారీమణికిం దెల్పుమి, యీరాత్రియె వచ్చునంచు నే గుమినాఁగన్. 70

గీ. తత్క్షణంబున నేయేగి తద్విధంబు, తెల్పముఖమున సంతోషదీప్తి వెలయ
దూతవేనీవు మత్ప్రాణ దాతవరయ, నీకరణివారుగలరేడ లోకములను?. 71

గీ. ప్రాణనాథునికి వే వేలు ప్రణతులనుము, తన్నుఁ బాసినదినముల నెన్నయుగము
లయ్యెనీ లెక్కరేయి యెంతగునోయనుచు, వేఁదుచున్నదిదయ సేయ వేడుచునను.

గీ. భాగ్యమంచునువిచ్చేసి భాషణములు, విన్నవించెను విభునికి వేడ్కగల్గ
సఖియలును దాను బీబిపోషకునొనర్చ,రహినెసంగుటయెంతయో రమ్యమయ్యె.73

క. ఆకరణిని సింగారము, పైకళ రెట్టింపు సేయఁ బరమముదముతో
రాకేందువదన చెలుల, య్యాకాశము వంకఁ జూచునా పనినుండన్. 74

వ. ఇచ్చట మేలుకోట సామిప్రోలను. 75

గీ. అమరనాయకునగరట్టు లఖిల మొప్ప, దివ్యభవనపురూపంబు తేజరిలఁగ
వైనతేయుఁడునిలిచిన వనజనేత్రుఁ, డెక్కెమక్కువ నెక్కొననక్క ఆపడి. 76

గీ. చారుతరమగుబీబి నాంచారియిరవు, లలితసప్తమసౌధాగ్ర తలముదానఁ
దారవలెడిగ్గవారెల్లఁ దత్తరమునఁ, జిత్తవిభ్రాంతినొందుచుఁ జెదరియరుగ. 77

గీ. బాలఖేలనవిగ్రహభాతి నెతగి, కానుపించెను జెలులకుఁ గానిబీబి
కపుడనిజరూపమును జూపనాపెయలరి, నాధునకు సల్పెఖుర్నీ ఘనయవినయత. 78

క. అడియేన్దాసినిభాగ్యము, గడియింపంబడియె నేడు కౌతకమనఁగా
నుడువకుమా మోసంబిఁకఁ, గడఁజాగునకొప్పఁగాదె కారణమన్నన్. 79

గీ. పరమహంసపరివ్రాజభక్తలోల, తరుణికొసఁగినబాసలు తప్పఁబూని
మధురవాక్య మెలాహిరిమత్తునకిడి, మమతఁగావించి మరచుట మంచిదెయన. 80

గీ. భక్తపరతంత్రుల మటన్న పాళి మెఱఁగి, తాళియుండు లేపత్నికి ధర్మమనుచు
తప్పుపైరింపుమాగమతాంత్రికంబు, లొప్పిదంబులొనర్ప మినుత్తవనరె?. 81

వ. అనుచు నాతండు వల్కు ప్రతివచనంబులు తమకు వినరాకున్నను బీబిసంభాషణంబు
వఁగనిపట్టి యెఱింగినవారు వోలె సఖీమణులా బొమ్మ నెసమ్మతిం జూచుచు నిట్లనిరి.

గీ. బాల్యముంగోలెమా బీబిబాహువులను, రాత్రిపవలులనెడఁ బాయరాని నీవు
మానవోఘకు గాంధర్వమంగళమని, యొప్పిదముఁ జూపి పెడఁ బాయ నొప్పునయ్య?.

గీ. కూళకూసగోల పేళనపాల్పడే, జాణలైనఁ దాళఁ జాలరట్టి
వెతలడించిపోతివిరహ పుబాముల, నీవెఱుఁగవె బీబియెఱుఁగకున్న. 84

వ. అనివారనుచుండఁగనే బీబినాంచారియిట్లనియె. 85

గీ. నీదుమాయలపహాయలెల్ల నిజమెఱుఁగక, చిత్తవిభ్రాంతియందురే చెలులు నాకు
బాల్యమైత్రియ దిరువుర భావములకె, గోచరముగాక యొరులకు సూచనగునె?. 86

వ. అనితమదేవిపలుకునంతనె బాల్యధోరణినెఱుంగక తమపైనింకేమిచాడిచెప్పునో
యని వేగపడియిట్లనిరి. 87

క. పదియాఱువేలసుదతుల, హృదయంబులు మాఱుగొన్న యేలికవనుచు
న్నొమ్మదలంటఁ దెలిసికొంటిమి, విదితుఁడవైనాఁడవరయ విగ్రహరూపా. 88

గీ. మేలుకోటసామిమీ నిజరూపము, గనఁగ దివ్యదృష్టిఁ గలుగఁజేయు
గోపకన్యలందుఁ గూర్చిన చూకూర్మి, మాపయిన్ఘటింపు మదనజనక. (అన్నంత) 89

ఉ. వారలప్రార్థనంబువిని వారికిమోదముఁ గూర్పనత్తటిం
జారువిమానమెక్కెఁ దనె సత్పథగామిగ నేగఁ జేయఁగ
న్ధారుణికాను పించెనొకతార విధంబున నేగ నేగఁగ
న్వ్యాకలటద్భుత ప్రముదవారిధిఁ దేలుచు నోలలాడఁగన్. 90

గీ. ఆవిమానంబరయు కపహారట్టు కాఁగఁ, జెలులు వేగురు నాపురి చిత్రమరయఁ
దిరుగ సాగిరి నలుదిశలొత్తికనుచు, దంపతులఁ గేళిగృహమునఁ దాము విడిచి. 91

గ. ఆత్రిక్రమెడ నేర్పడియున్న సమయమై చిత్ర్యంబువర్ణింప. 92

సీ. ప్రాగ్వాసనామితపుణ్యాను భవమునజతపడ్డయల స్వర్గసౌఖ్యమేమొ
అక్షయానందంబు నతులమ్ముగా నిచ్చు సిరిసంపదలఁ బోలు చెలువమేమొ
విరహిణీజనులను వేటాడ వెడలిన కందర్పుదివిటిదౌ కాంతియేమొ
జారచోరులనాపజగ దీశుఁడింటిలో పలనుంచు దీపంబు వెలుగొయేమొ.

తే.గీ. నాఁగనొప్పెడు కౌముది బాగుగదగు, లలితబహుపుష్ప సురభితమలయమారు
తమ్మొగెమ్మెల్లెడఁ గ్రమ్మను నెమ్మదిచెడి, జడలదారులు రాగులై వెడలరెకట!. 93

గీ. పుష్పకాంతః ప్రదేశపుభూరివిభవ, మరయనిష్కామి కామిగాకగునె నిలువ
నట్టులఘటనుసఖియులా యంతయుఁగని, ఘనునిమహిమంబుఁ దలఁచిరి కాంతులాదవ.

గీ. విరహతాపోజ్జ్వలంబుగ వెతలుగలిగ్గి, కాముకులుగను మమతయుఁ గలుగఁజొచ్చె
దేవిసేవింపుచుంట నీదివ్యమహిమ, లరయనోచితిమంచప్డు మురియఁగనిరి. 95

గీ. ప్రాచిదక్షిణములఁగాంచి వరుణదిశను, గనిరిమ్లేచ్ఛాధికారుల ఖడ్గధరుల
నాహవోజ్జ్వలకోపరక్తాక్షిదీప్తి, తాసవోద్గమశ్రీ యదవక్త్రాంచితులను. 96

వ అట్టియెడసతీమణులాయా సహోత్కర్షంబభి వర్ణించిరెట్లన్న. 97

క. కల్పతరునాసవంబిది, యల్పంబనియెంచనగునె యారోగ్యకరం
బల్పునిబల్లిదుఁజేయును, నిల్పునటాజికిని నెదుట నిర్భయభటుఁగాన్. 98

ఆ. దేహకాంతిఁగనఁగదే దీప్యమానమౌ, సాహసాంకశక్తి సంభవిల్లుఁ
గల్పతరువుధారఘున పుణ్యాలకునబ్బు, నల్పజనులకబ్బ నరుదు కాదె. 99

వ. అనితద్వివరంబెల్లమున్న తామెఱింగినవారౌట న్వేవిధంబులఁ జెప్పికొనుచునిట్లు
వీరుండనట సౌధాంతరంబునబీబి. 100

క. అంతటనిష్కపటంబుగఁ, జెంతను మెలఁగుటయెమాని చింతాన్వితయై
పంతమునవొంచుగుబీబికి, సంతాపంబుప్పతిలుట సరసుఁడుగనుచున్. 101

మ. పొలయల్కంబలెనోరమో మిడుచునాపూబోఁడి కూర్చుండఁగా
నలకల్బూవుచునంతరంగమున నాయబ్జాక్షిసంతాపముం
దొలఁగంజేయఁదలంచి యిట్లనియెనాతో నేల భాషింపవే
యలుగంబూనిన కారణంబెదియొ నాచందేమితప్పెన్ని తే?. 102

చ. అలిగియిటుండ నేమి ఫలమంబుజమందును జంచరీకమి
ట్లలుకవహింపఁగానె వరికందులలాభమె యెంచులోభమౌ
లలనలమానసం బెఱుఁగలత్ప్యము చేయుదురేరువారినీ
యలుకలుకాంచికాదె యిటులారయకుండఁగ దూరమేగుటల్. 103

చ. అనిశముకోపముంచఁ దగదందునివారణ ముందె తెల్పితి
స్ఘనముగుభక్తపాలనము కంటెను నెక్కువలేదిఁకెద్దియు
న్ననునిటునిందచేయుటెది నర్మిలిభాషణలంచునెంచెదో
కనుఁగొనుమింకనిష్కపటకాంతుఁడవాక్యము నిక్కవంబగున్. 104

మ. మనవిశ్లేషముగొప్పగాదరయనా మానీంద్రునుల్లంఘనం
బనఁగాదుస్సహమెన్ని భంగులనొనన్నాతండు చీరంగనేఁ
జనకున్నంతనె సాహసించియిఁకఁదాఁ జూపంగనుంకించెడి
న్మనయీకూటమి వాయనోర్చినది యామానీంద్రుఁగాపాడనే. 105

మ. వదలంజాలవునన్ను నీవరయ నప్పాపుండుభూమీశుతోఁ
గడియించెన్నపథంబుఁదాఁ బిలిచిరాఁగంజేసెదన్నన్నటం
చదిగాకున్ననిఁకేమి కావలయునా యందుండునానమ్మిక
ల్చెదరంబోవవె భక్తరక్షణమునేఁ జేయంగలేకుండినన్. 106

వ. అనియాతండువలుక వినివినియొక్కింతతడవునకు మెల్లనమోమెత్తి. 107

మ. అనఘా దేవరయూక్తులందుఁ బరిహారాధారమేచుండిన
న్ఘనకేళింజనుబాసలం దలఁపనోఁగాకీవిధంబంతయుం
దనుతాపంబడఁపంగఁజాలునె మనోదార్ఢ్యంబుఁగల్గించునే
యనిశంబున్విడ నాడనంచనెడుమీయా నల్విరుద్ధంబుగాన్. 108

చ. చనుచుఁదలంపకుండినదె చర్చకుఁగారణమెట్లుకాదు! నా
మనమునధైర్యమెట్లగుఁ బ్రమాదముతోఁ పమియేనెఱుంగనూ
వినఁగనరాణివాసమిది వీనులుఁగన్నులు రిత్తబోత్తలా
మనముకలంకఁగుందుటను మానుచునెట్లవి తెల్పలేనివై 109

వ. అనుచునింకింక నేమేమి యోపలుకునట్లున్న జాడంగాంచి యాప్రోడసందిచ్చినం
బసందుచెడునని ముందునకుజరిగి.

గీ. నీదుసాహసవాక్యము ల్వినువినవె, బయలువెడలితివచ్చితిఁ బంతమేల?
వలదువెన్కటిచింతనవాదులేల?, తప్పులెన్నకుమంటిఁగా తలిరుఁబోడి. 111

గీ. అంచుఁగౌఁగిటఁజేర్చి కొంచనిగమెనుతిరుము, భక్తవత్సలబిరుదును భద్రపఱప
బొందియరిగినమానస మిందెకలదు, నీదుహృదిలీనమైయుంటనే నెఱుఁగనె?. 112

సీ. కుసుమాంగినీస్పర్శ గోరంతసోకినమేనికాకలు దీఱుమీఱుఁజలువ
ఏణాక్షినీచూడ్కియే మాత్రమానినసెదకుదురుగముద మొదవెడిఁగద
శుకవాణినీమృదుసూక్తులు వినఁబడ్డవీనులకమృతమ స్వాదుకలుగు
పద్మసుగంధినీప్రక్కనిల్చినఁ జాలుఁబరితాపమును ముక్కపట్టియాడ్చు.

తే-గీ. మణిమయస్వర్ణవిగ్రహా మరతునెనిను?, నీలమణిరుచినొప్పెడి నెఱికురులివి
అధరమిదికెంపుద్యుతిమీఱు సుధనుగేరు, చంద్రవదనరానీ నవ్వెచంద్రికగదె. 113

వ. అంతనింతిచింత వాసియిట్లనియె. 114

క. దేవరకునుసాదృశ్యము, భావింపఁగఁగల్గునేడ? బల్కులుకొఱఁతా
తీవికొఱంతయ? మాయలు, నావిధములెకావె? మనసుహరియింతుహరీ. 115

గీ. అనుచునీకోఁబునారత హర్షమంది, కాయములనొప్పశ్రమజల కణములిగుర
మలయపవనవిహారపు విలసనమున, విరులతావులనెన్నుచుఁ దిరుగుచుండ. 116

గీ. ఖేచరాంచితపుష్పక క్రీడవెడలి, సప్తజలధినవద్వీప సంతతులను
జగమునం దెల్లఁగల మహైశ్వర్యములను, అరయుచుండిరి వెఱఁగందుచతివలెల్ల. 117

ఉ. ఆగతిఁ గాంచిరొక్కట మహావిభవాఢ్యుల నింకనొక్కఁట
న్భోగులరోగహీనులను బుణ్యులనొక్కఁటఁ బూతగాథుల
న్యోగులనొంటనిష్ఠఁదగి సుస్థిరతం జెలువొందువారలం
ద్యాగులనింకనొంట బహుదానపరాయణులైన వారలన్. 118

క. కనుఁగొని రాశ్రమమొక్కటి, కనవచ్చు మునీశుఁడొండె ఘననాదంబు
ల్వినవచ్చు వింతయదియని, యనవచ్చుంగాదె వారలడిగిరలమునిన్. 119

చ. ఇదికడునద్భుతంబు జనులెవ్వరుఁదోఁపరు తూర్యనాదము
లుమ్మదముగనంబుమధ్యమున మ్రోయుచునుండుట కేమికారణం
బదియెఱిఁగింపు మాకనుడు నమ్ముని యిట్లనుమాండకర్ణియ
న్పదమలపూజ్యుఁడొక్కముని సత్తముఁడిందుఁదపోబలంబునన్. 120

క. కుహరీకృతసలిలాంతర్గృహమున నచ్చరలతోడఁ గ్రీడాపరత
న్విహరించుచుండనిట్లగు, మహిళాజనకలితగాన మంజులరవముల్. 121

వ. అవవినుచు నాశ్చర్యంబందుచు నటువాని. 122

గీ. దివ్యవనములనటఁబలు దెసలఁగనిరి, నిరుపమానందకరపుష్పభరితములను
భవ్యరుచికరబహువిధ ఫలయుతముల, సారసాంచితకాసార సలలితముల. 123

క. ఆరోగ్యదాయకములా, హారంబులటంచునవటి యబలలుఁబురుషు
ల్త్రీరైనవారటంచును, వారలువర్ణింత్రుసాగి వచ్చెదువేళన్. 124

గీ, ఊర్ధ్వలోకాళివర్ణింప నొకరివశమె?, నిరుపమానంబు నానంద నిలయమునగు
నందుఁజనఁగోర్కెలొనఁగూడునతిశయముగ, నంచువర్ణింతురాక్కింతమించువేడ్క.

క. తొలిరేయివిహారణంబున, బలుతావులఁగన్నవాని వర్ణించుటతోఁ
దెలవాఱుజామునందుం, గలికిమహాసౌధమునకుఁ గామినులేతే. 126

వ. సకలచరాచర నిర్మాణహేతుభూతుండైయు సతీమోహంబునం జనకపడి
యుండి కాన్పించి యటనున్న సెల్వపిళ్లెరాయని దర్శించినంతనె పుష్పకంబుడిగ్గి
పూఁబోడులెల్ల జోహారులొనర్చి యిట్లని విన్నవించిరి. 127

గీ. మోదమిప్పటికాయెనో మోహనాంగ, మాసహాసాంగనలతోడ మమతలుడుప
గోపికాక్రీడఁబోలిన కూర్మిసలుపు, కోర్కెయిఁకనిదెయంచన గురుఁడువలికె. 128

గీ. సంశయంబేలదానికి? సఖియలార!, తేఁపువిహరించుతటినది చూపఁబడును
నాఁగనేమొక్కఁజాగిరా నారులెల్ల, నింతకన్నమదమకుస్నె యొచ్చమతి.

వ. అప్పటికివారినెల్లరవీడ్కొని విగ్రహాకృతిఁదాల్చివిమానారూఢుండై యరిగిమరల,

క. మఱునాఁటిరేయిమాయా, కరపుష్పకనిలయుండగుచుఁ గారుణ్యమునం
దరుణీమణిసౌధంబున, ద్వారసదృశసరణిడిగ్గెఁ దారయవోలెన్. 131

చ. అనిశము రాకకై యెదుట నారయనారయ వేట్కమీఱఁగా
గనుఁగొనఁగల్గి పుష్పకముఁ గాంతుసటంత నె చూడఁగల్గుట
న్మనుటయుఁగల్గెభూషాభరణ మమ్మలనెల్లర వే భరింపఁగా
నెసరునవారిలితొరమహనీయ ప్పదీశమనోహరాకృతీ. 132

గీ. మీనకేతుశరంబుల మేనుగంద, శారికాకీరకేకుల సంకులముల
జంచరీకరుతంబులఁ జంద్రకళల, నంగనలమేనుతాళమి బెంగవోడమె. 133

గీ. విరహవారాశిదాటింపఁ బరమనాక, చందమునఁనొప్పురాధికా నందదాయి
సౌధమునడిగ్గవేగమే సారసాక్షు, అనుచుఁబొంగుచుఁ జెలులెల్ల హాజరైరి. 134

గీ. కేళికాసక్తబీబియుఁ గేలుమోడ్చి, దాస్యమొనరుపదీవించె దయితుఁడపుడు
స్వారివెడలుదమంచును సరసనూక్తి, లాడనారోహణముచేసి రందఱుందు. 135

గీ. సాగరాంబుమధ్య సంస్థితమైయొప్పె, ద్వారకాపురంబు తరుణులుగన
అరియఁగోరిడిగ్గి రాపురమందును, దేజరిల్లుహవాయలు తిరిగిచూడ. 136

గీ. అష్టదిక్పాలవరులెయందనవరతము, బలుఖిలేదార్లుసర్దార్లు వాజివహుల
ఫౌజుదారులుయూథము ల్పన్నువారు, నాజికోవిదులోజనై యమరువారు. 137

క. సురనాథునగరమట్టులఁ, గరితురగభటాళియొప్పు ఘనతయునొప్పా
న్సురకిన్నర గంధర్వుల, సరివోలెడిపౌరులొప్ప సంపదలొప్పన్. 137

క. రాసులెనవరత్నంబులు, భౌసిలుబారువులలెక్కఁ బలుతెరగతులం
గాసులుమొహరీల్వరహా, ల్వాసిగనాణెంబులెల్ల భండారములన్. 139

మ. అట్లబృందావనవాటికానఁబడె బహ్వైశ్వర్యయుక్తంబుగాఁ
బటుసంతోషమునొందిమేనెలుఁగకే భ్రాంతాత్ములై యేగుచో
మటుమాయన్బహుబంధుజాలవిలస న్మాయాయశోదాగృహం
బటుగోపీజనశాలలేర్పడియె నత్యాశ్చర్యయుక్తంబుగా. 141

క. విటుఁడౌసామియటేగఁగఁ, బటిమపుఁజిత్తరువదేమొ భామామణియా
నుటుమాయరాధవచ్చినఁ, బటుసోదరియాచుబీబి పనుపడియుండెన్. 14[illegible]

గీ. గోపికలతోడఁజెలులెల్ల గూర్మిమీఱ, వారివారింటివారితో వీరుఁగలిసి
మెలఁగితిరుగుచు వెన్నపాల్మీగడలను, నారగింపఁగగొన్నినా శ్చర్యగనయ్యె. 14[illegible]

వ. అంతనొక్కనాఁడు. 14[illegible]

క. బృందావనరమ్యస్థలిఁ, జందురునిప్రకాశ మొనర సంతసమలర
న్నందాత్మజుఁడగుమాధవుఁ, డందముగా నుమురళిశ్రుతి యనుసంధించెన్. 144

క. శ్రుతిమేళనంబు వినఁగనె, యతిమోహంబావహిల్లె నతివలకెల్ల
న్నుతియించుచుఁ జెంతకుఁబోఁ, బతులూహలు సేయనట్టి సాహసమొదవెన్. 145

గీ. రాగులయిరి రాగాలాప రమ్యమరసి, లాహిరియటునసాగె లలనలకపుడు
పరవశాయత్తదేహ విపాటవమున, మరుశరంబులదాడికి సమతలొదవె. 146

గీ. ప్రాణనాథునిఁగనకిఁక బ్రదుకఁగలమె, యనెడునాసాహసోన్మాద మంకురింప
బంధుగోపికలొనరించు భంగిఁ జెలులు, విరహవేదనకోర్వక వెడలిరపుడు. 147

క. సురకిన్నరగంధర్వులె, మురళీగానామృతమున మోదాత్మకులై
యరయుచు దివినటునిల్వఁగ, నరులెంతటివారు జ్ఞప్తి సానలు వెలయన్. 148

క. పశుపక్షులెల్ల నచ్చట, నిశియనినిదురింపఁబోవె నిర్మలహృదితోఁ
బశుపాలకుమురళీరవ, వశతనువిడ కేడవాడ వశియించెసదా. 149

గీ. నెమలిఋషభమజము నెటిఁ గ్రౌంచపక్షియుఁ, గోకిలాశ్వకములు గుణవివరణ
స్వరములేడింటికిని సాంకేతసంబంధ, సాక్ష్యమిచ్చునట్టె చక్కనిలిచె. 150

గీ. అంచసింగము భేరుండ మలహరిణము, సాళువముజిల్క శారికల్సరిగమలను
స్వరములకునై నవాహన సరణిఁ దెల్పఁ, బెంపుమీఱంగ మెలఁగెను బెఱుకులేక. 151

గీ. జాజిసంపంగిసురపొన్న లోజవిరిసె, మల్లెకేతకికరవీర మంజులములు
గీతసుస్వరమేళనఁ గీలుకొల్పఁ, దత్స్వరంబుల హారసంతతియనంగ. 152

గీ. ఘనతగలచూతఖర్జూర కదళులునటి, జంబువును దాడిమంబు ద్రాక్షయును బొన్న
తామెసప్తస్వరంబుల ధామములను, టంచుఁ దెల్పంగననఫలియించెనపుడు. 153

గీ. రాలఁగరఁగించు గాంధర్వ రాగమెన్న, జంగమంబులకానంద సంపదతగి
మనసుకరఁగుటయాశ్చర్య మనఁగవలెనె. చెలియలాడ లెఱుఁగగమాలి[illegible]లిచిరటనె.

గీ. గోపికాజనబృందంబుఁ గూడిబీబి, తనసహస్రసఖీమణుల్తాను మ్రొక్కి
మోహపరవశగతిగల యూహఁ దెల్ప, భక్తవత్సలుఁ డిట్లను భావమరయ. 155

క. సంగీతలోలులారా, యంగీకారంబుఁ గనునె యటు గేస్తులకీ
యంగజకేళివినోదము, భంగంబగుసాధ్వీచరిత భావముఁ దలపన్. 156

వ. అనిశ్రీకృష్ణుండనుడు వనితామణులెల్ల రిట్లనిరి. 157

క. పతులకుసతులకుఁ బతివై, సతతమునవవిధములైన సంబంధములం
బతివగుటనాతనంబే, వితమరయఁ బతివ్రతాత్వ విహితమెయిదియా. 158

క. క్రీఁగంటిచూఁపుగలవార, భోగార్థులఁబ్రోవుమీఁదఁ బూఁబోఁదరిండ్ల
న్వేగంబెకేళికాసుఖ, భాగుండవుగమ్ముకామి బ్రదుకుటసున్నా. 159

వ. అని విన్నవించినంతనె కృపాయత్తచిత్తుండయి. 160

గీ. నాయకీజాతులకసియానాయకుండు, జాతికనుగుణబంధముల్ల తపఱచియుఁ
గళలనాటుచుఁదమిరేప గళరవంబు, లందముగఁగల్గుకేళికా నందమొదవె. 161

క. అందటికందఱుతానై, సుందరలతకుంజములను జోద్యంబొప్పం
బొందుగభోగానందము, నొందఁగసంపూర్తిచేసె నొకటొవేళన్. 162

గీ. ఇట్టులారేయిగ్రీడించి యిరవులకును, జేరినిజవర్తనంబునఁ జేడెలుండి
యప్డుగోగణజాలంబునరయుజూడఁ, గానసంబునఁబ్రేపల్లెఁగాంచిరంత 163

గీ. వత్సరంబునకొకసారివనవిహార, మందుఁజెలఁగంగ నొచట్టివిందులమర
నీకరణిమోహపరవశు లైకడపిరి, పెక్కుహాయనములనాడ నొక్కనాఁడు. 164

క. జలరాసక్రీడలనొగిఁ, బలుతెఱఁగుల గోపికలకుభావములలరం
జెలఁగుచునలకేళివిధి, స్నెలఁతలుగనుచుండ నేగె నివ్వెఱగందన్. 165

త. మంతనముసల్పువేళను, వింతగభంగించెనంచు వెదకుచుఁజనిరా
యంతర్హితత్వమెంతయుఁ, జింతింపుచుదచ్చికడల శ్రీహరియనుచున్. 166

వ. అట్టియెడఁబూర్వప్రవర్తనంబులం దామనోహరచర్యలందలంచి ప్రార్థింపఁదొడం
గిరెట్టులననిన. 167

సీ. శ్రీమచ్ఛరచ్చంద్రకౌముదీద్యుతిమీఱియమునానదీ తీరమందెసంగ
గంధర్వవరనుతగానంబు మురళినిగదియించి తౌరమోదదమహాత్మ
సారిసస్సరిగమసారిసస్సనిపమ సరిమపాసరిసపాస్సరియనంగ
అలగోపికలవీనులలరంగనీ గానసుధఁగ్రోలికొంకకచౌరవఁగనిరి.

తే-గీ. తరితకుందరితాంతరిత ఝణుధణత, తధణఝుంతరి ఝకిణతతకిటధిమిత
ధీంకుధీంకృతకిటతక ఝూంకృతంబు, కుదురుబహుశబ్దజాలంబు గుప్పితౌర. 168

గీ. చింతలన్నియుఁబెడబాయు చిత్తములను, జిత్తజుమిటారులెల్లనీ చెంతఁజేర
భ్రాంతమతులైనవారికిఁ బ్రాపవైతి, వేణుగానవిలోల మేల్జాణభళిర 169

సీ. కంకణకింకిణీఘననాదములు మ్రోయకిణకిణాంధణధణాం ఝణఝణతయనఁగ
మవ్వఁపుఁగటిసూత్ర మంజురవముదోపతకతకతక ఝణఝణతకిటయనఁగ
పచ్చలవజ్రాలపతకాలకాంతులు చకచకనిగనిగచక్కనెసఁగ
నవరత్నమణిమయ నవ్యభూషణములుతళతళమెఱపెడు తళుకులీనఁగ.

తే-గీ. గోపగోపికగణంబులు కూర్మిఁ జెలఁగఁ, గ్రీడలొనరించు నీహాయయల్పుఁడెఁదరమె
మానవాకృతిఁ గైకొన్న మాహృదీశ, వేణుగానవిలోలమేల్జాణభళిర. 170

వ. అనియిట్లువర్ణించుచు సమ్మోహయాగోపికలంగలిసి బీబీపరిచారికా సహస్రగోపికాగ
ణంబును వెదకుచుండి. 171

క. చెలికత్తియలా వేగుఱు, నలుదిక్కుల వెదకి వెదకి నాథుఁగనకయే
బలుదూరమరిగియరయఁగఁ, గలదందొకయాశ్రమంబు కనరమ్యంబై. 172

గీ. జాతివైరంబె లేదిడజంతుకోటి, కేమిచిత్రంబొకంటికే యింతులార
పర్ణశాలలమౌనీంద్ర పరిజనముల, వేదశాస్త్రార్థఘోషచే వీనులలరు. 173

గీ. సకలఋతువులసుమముల వికసనమదె, అమృతతుల్యంబుకాసారమందుజలము
అల్లచంపకపాటలహల్లకములు, మల్లెకేతకులానిన మారుతమిదె. 174

వ. అనికొనుచుంగొన్ని యడుగులుముందిడుడు. 175

గీ. చంద్రకాంతశిలామయ చారుగిరియు, నింద్రనీలసుసోపానమెసఁగఁగాంచి
చంద్రనిభముఖులందఱా చందమరయ, డాయనరిగియు మెల్లనా చాయనిలువ. 176

గీ. కనకమునుమించుకాంతిచేఁ గళలఁదేరు, నట్టిశిష్యసహస్రంబున మరనడుమ
మెఱపుతీవియచందాన మేనుమెఱయు, తాపసోత్తముఁగాంచిరి తరుణులపుడు.

గీ. అందునిల్వఁగనానంద మధికమగుట, వందనంబులుసల్పిరి వానికపుడు
దీవనలొసంగె సౌభాగ్యదీప్తులమర, గోపికావేషధారులఁగూర్మినరసి. 178

వ. అలమహాత్ముండగుము నిశేఖరుండిట్లనియె. 179

ఉ. మేమువరప్రసాదమున మేరుగిరీంద్ర సమీపమందునా
సోమగిరిన్వసింపగురు శోభితమానసస్పృష్టిచేతనీ
భూమినినుద్భవించితిమి భూసురవర్యులమమ్ముఁ గూడమీ
స్వామికృపాకటాక్షుల వసంయుతయోగులఁగా నెఱుంగుఁడీ. 180

క. యోగముచెడభూసురులై, భోగాధ్యక్షుతనునొంద భూపతులగుచు
న్నాగముభోగముగతిగా, యోగముమదిఁదలఁప కుఁదురుర్వినివారల్. 181

సీ. మంత్రయోగంబుచేమారుత సంచారదేహమర్మంబులు దెలియవచ్చు
లయముచేఁదనలోనిలలిత ప్రణవనాదసూత్రంబు మదినూనిచొక్కవచ్చు
హఠముచేజర మనశ్శరములు భేదించి కాయంబుసిద్ధినిగానవచ్చు
సాంఖ్యయోగంబుచే సకలేంద్రియవ్యాప్తులరయుచుఁ దన్నుఁదానెఱుఁగవచ్చు.

తే-గీ. దారకముచేతఁదనువులోఁ దానువెల్గు. చున్నరీతినిగనవచ్చును రుతరముగ
రాజయోగంబుచేఁ బరబ్రహ్మమందుఁ, బొందియుండంగవచ్చును బూర్ణుఁడగుచు.

సీ. హఠయోగమెట్లనయమనియమాసనములును ప్రాణాయామమును మొదలగు
యోగసాధనములనొగిని కుంభకముద్రసాధనాన్వితమగు సరణియోగ
మనునగినద్వాదశాబ్దంబులందునె సిద్ధిసంభవమగు సిద్ధరసుతులకు
నందునుముఖ్యంబయందును దర్పణముద్రయాంచర యంగమోదకరము,

తే-గీ. మంత్రమననంబు స్మరణయుమదినిగూర్చి, రేచకంబుకుంభకముల రీతిమెలఁపి
ధ్యానధారణసల్పనౌఁ దత్త్వసిద్ధి, జపమొనర్పంగనిర్మల జ్ఞానియునగు. 183

వ. ఇట్లుద్వాదశాబ్దపరిమిత నిష్ఠఁ గడఁగునెడం బ్రథమాబ్దంబునరుజహరణ ప్రాప్తి యుద్వితీయంబునఁ గవితాధోరణికలుగుటయుఁ దృతీయంబున విషయాసక్తి తొలగుటయుం జతుర్థ హాయనంబు నక్షుత్పిపాసభ్రాంతిని గెలుచునేర్పును బంచమంబున వాక్సిద్ధిఁ బడయుటయును షష్ఠంబున ఖడ్గాద్యాయుధ సమితిచే నక్షేద్యుండగుపటిమఁగనుటయు సప్తమవత్సరంబున జగతినంటకనిల్చి తెఱంగెఱుకవడుటయునష్టమంబున నణిమామహిమాద్యష్టైశ్వర్య సంసిద్ధిఁబడయుటయు నవమంబున నాకాశగమన సామర్థ్యంబులభించుటయు దశమసంవత్సరంబున మనోవేగంబాదవుటయు నేకాదశంబున విశ్వంబెల్ల వశపడుటయు ద్వాదశంబున సాక్షాదీశుండు తానగుటయు నెరుపడునిదియెతత్త్వసిద్ధిక్రమంబు ఇదిసామాన్యులకు దుర్ఘటంబుపూర్వకృతసుకృతవిశేషంబునఁగాని యోగంబలవడదు ఇదియెమావివరంబుగదా.

క. మామకశుభదాశీస్సున, భూమండలవిభుఁడుమీరుఁ బోలినవిభుఁడౌ
సామర్థ్యమొనరునమ్మఁడు, వేమోదముచిక్కనిలుఁడు విమలాత్మకులై. 185

వ. అనియాశీర్వదించి వారిన్నిలిపికొని. 186

గీ. విందుగావించిరాపూట వివరమెఱుఁగ, మోతిలాడులు కేసరీ భాతు ఫేణి
దూదుఫేడాలుబర్ఫియుః స్వాదుఫలము, లెన్నియోకూర్పభుజియించి రేపుమీఱ.

క. చందనతాంబూలాదుల, సుందరులానందమంది శోభాయుతలై
సందర్శించిమహాత్ముని, వందనమిడియిట్టులనిరి వారలువేడ్కన్. 188

క. కడుదవ్వియాశ్రమమీ, కడకెట్లగురాకమగుడ గారుణ్యనిధీ
అడియాసఁగొల్వకార్యమె, అడియేన్దాసులమొసంగు మాజ్ఞ మహాత్మా. 189

గీ. అనివచించుచెలుల నాశీర్వదింపుచు, దవ్వటంచుమీరు తలఁపవలదు
ఓషధిగొనుడిదియె యుక్తవేళకుమిమ్ము, నిచటఁదెచ్చినిల్పు నింపుమీఱ. 190

క. సంకల్పమాత్రముననే, సంకేతస్థలమునందు జక్కఁగనిడెదు
న్నంకితమతినుండకుఁడీ, సంకల్పించితినిమున్నె సమకూర్పింతున్. 191

క. మీమీజీవితకాలము, కామితభూస్వర్గ భోగ ఘటనగలుగఁగా
నీమముఁదప్పక భక్తిని, స్వామిన్నాంచారిఁగొల్వఁ జనెదరరుగుఁడీ. 192

వ. ఇంకనీమ్రుఁ గలుఁగనున్న భవిష్యద్వరుం డెట్టివాఁడనంగ. 193

క. దర్జామహాత్త్వ మెన్నఁగ, మర్జామస్తాను మేటి షాహిన్షాహా
మిర్జాఖుదాఫరస్ తె దార్, దర్జాఖాన్వరుఁడతండె తాఖత్ దారా. 194

క. తనువులు సహస్రసంఖ్యగ, ననువుగఁ దాదాల్చి మిమ్ము నబలల నెల్లన్
న్వినుతానందశుభము నిడు, ననవిల్తుని కేళిఁ దేల్చు నవ్యప్రతిభన్. 195

వ. అనుచు వారిభావికాల వివరణంబుం దెలిపియు. 196

గీ. పాదలేపనరసమొప్ప బరిణనొసఁగి, వలయు వేళలఁ బదముల నలఁదికొనిన
దలఁచుస్థానముఁ జేరఁగ దరమగునిది, భద్రముగ నుంచుకొనుఁడన భాగ్యమనిరి. 197

ఆ. ఆజ్ఞనొసఁగుఁడంచు నంజలుల్ లొనరించి, బహువిధములనుతులఁ బరగఁజల్పి
యానవడసి కదలి యందందు విభునిని, వెదక నేగిరంతఁ గదిసివారు. 198

గీ. వనములెల్లను వెదకియు వారిజాక్షు, యలసిసొలసినవారమై యాత్మచోర
కాముకులమమ్మఁ బ్రోవుమీ కరుణతోడ. నంచుఁ బ్రార్థింపఁదొడఁగిరందరయ లేక.

గీ. కఠినమెల్లఁగుచయుగంబులఁ గదియించి, మృదువుపదములందు మిగుల మెల్లఁ బె
సృష్టికర్త తెలివి చేటొనగూర్చెనే, యిష్టవిభుని వెదక నేగలేమి 200

గీ. రాయిరప్పలనక హాయిగా వనముల, సఖుని వెదకుటకును సాహసించి
యెంతదవ్వైన నెలమితో నడతమఁటన్నఁ జింతపొడమె యలసటఁగన. 201

క. తబ్బిబ్బులనుచుఁ దరుణుని, యబ్బురపుంజ్యోఁ దలఁచి యాయాసముగా
నిబ్బరము సెడిరి వెదకఁగ, బిబ్బోకవతుల్ సహస్ర బిసరుహనేత్రల్. 202

వ. అంతనన్వేషణయత్నంబు వృథగ నగుడునన్యచింత పొడమిన వారెల్ల నొండొరువులతో
నిట్టులనిరి, 203

క. లీలామానుషచర్యలు, హేలావతులార మనకు హెచ్చుగఁ జూపెం
గాలావధిమఱచితిమిఁక, నేలీలన్బొంకనగునొ యేలాగగునో. 204

క. ఏమని బొంకఁగనగునో, ఏమిషఁ గల్పింపఁదగునొ యేగి ప్రభునితో
సామింగూడిన కాలము, సామాన్యమె యెన్నొ యేండ్లు జరిగెనెకట్టా. 205

వ. అనవిని బీబీనాంచారంబ యిట్టులననియె. 306

గీ. శంకమనకేల సాహసచర్యనూని, భీతిఁ జెందుటనేమగు బేలలార
సింగమండయ్యెఁ గుంజరశ్రేణి లెక్క?, గోపశేఖరు భరణాను గొదవగలదె. 207

గీ. వీలుగలిగినచోఁ గోట విడుచుఁగాక, వీలుగామిని మేల్కోట విడుపుఁగాక
కలవరింపక చూడరే కాంతుజాడ, నిరుపమాకారుఁగానరె నెమ్మితోడ. 208

క. ఈరీతి బెగడుఁ జెందిన, నారుల యుల్లంబులరసి నాథుఁడు మరలం
గారుణ్యకటాక్షంబున, నా రామలతో నికుంజ మందు వెలసియున్. 209

క. బంగాళరాగసారణి, శృంగారవతుల్వినఁగఁ జెలఁగుచుఁ బాడం
బొంగారె గబ్బిగుబ్బలు, బంగరుచేలముల మేటి ప్రభుఁగనిగబలల్. 210

క. డాయంజని జోతాములు, కాయంబులు పుల్కరింపఁ గానొనరుచుచుం
బాయంజన నేమమ్ముల, మీయండ సెనమ్మి యిటకు మే మొగిరాఁగాన్. 211

వ. అనుపల్కు విని యున్నవనివాఁడు పోలెఁ! బ్రియుండిట్లనియె. 212

గీ. వనవిహారము మిక్కిలి వనటఁ గూర్చె, పూలనిరసించు నాప్రియు రాలిసొగసు
అంతలో యాదిరాఁగ నావంతవాసె, నమ్మి యీజాడ వెదకఁగ మిమ్ముఁ గంటి. 213

గీ. అననె బీబియు ఖుర్నీషు లాచరించె, మోహనాకార రాధికా గేహవాస
మాకుఁగల కోర్కె తీర్చితి మహితయనుచుఁ, జెలులు జోహారువులు సేయఁ గలిగినంత.

గీ. చెలియ నంకస్థలంబునఁ జేర్చి నిమిరి, తత్క్షణంబునఁ బుష్పకాంతరమునఁ దగి
వేగగనవీధి నేగుచో వింతయేమొ, సౌధభాగంబు కాన్పించె సఖులకపుడె. 215

గీ. వేగుజామున సౌధాగ్రమాఁగతిఁగని, బీబితో డిగ్గిరంబట భేషటనుచు
మేలుకొల్పునగారాల లీలలొప్పె, ముదితలకు మాయ క్రమ్మెడు మదకలఁగఁగ. 216

గీ. వ్యవధి చందంబు దలఁచిన వారలేరు, మాయదేవుని మహిమంబు మదిని మెచ్చి
చెలులు వేగురు వెఱగందు చింతలుడిగి, కాల్యకృత్యంబు లొనరింపఁ గడఁగిరపుడు.

క. శ్రీరుక్మిణీశ కేశవ, ధారాధరనీలదేహ తామరసాక్షా
కారుణ్యాబ్ధీ త్రిజగ, ద్భారవహా గరుడవాహ పాండవపక్షా. 218

పంచచామరము.

సురేంద్రరక్షకా మహాత్మ సూర్య చంద్రలోచనా
సురారినాయకాంధకార సూర్య పాపమోచనా
విరాజమాన వేదవేద్య విశ్వవిశ్వనాయకా
పురారిసన్నుతాచ్ఛకీర్తి భుక్తిముక్తిదాయకా. 219

గద్యం. ఇది శ్రీహేమపాలస గోత్ర కామిసెట్టి వంశపవిత్ర శ్రీవేంకట
దాసపుత్ర పేరమదొరాఖ్య సుకవిమిత్ర
ప్రణీతంబయిన యాదవాద్రీశో
పాఖ్యానంబునందు
ద్వితీయాశ్వాసము

---

# తృతీయాశ్వాసము.



క॥ శ్రీవేదాంతవిహారా, దేవావనదనుజహరణ త్రిభువననేతా
పావనసురమునిజనసం, భావనశ్రీవేణుగోప బాలసుచేలా.  2

వ. అవధరింపుమా వలికథా వివరణం బెట్టులనన్న,

గీ. ఇట్టిమాయామహిమముల నెన్నియేని, బ్రతిదినంబునుజూపుచుఁ బరమమోద
భరితులంజేయుచాబీబిఁ బరిజనముల, స్వర్గసుఖమేలతమకన్న సరణిమనుప.  3

క. అట్టులదినములు జరిగినఁ, గట్టడిగలపనియదెట్లుగాదనుచింకం
గుట్టుడిపిరట్టొనర్చియుఁ, బట్టునవేనుద్వహింపఁబాదుపసుతతాఁ.  4

గీ. దాదిఁజూచినన్నుఁదలఁపవ దేమకో, లొమ్మరేపాసఁగుదు లెమ్మటంచుఁ
గాలమెల్లజరిపి కడుమోసపుచ్చితి, ప్రాణహానియగు టె ఫలమటనియె.  5

గీ. పరిణయార్థ మింకఁ బరికింపఁ దగుఁగాన, బొమ్మఁదెచ్చుమాట బొంకెయైన
బితనటరయనేగి భేషనఁ దెల్పుము, యతికిరాయభార మతులితమని.  6

గీ. ఓయమ్మదాదివినఁగదె, మాయయ్యాసమీపమునకు మసలకచనినీ
వాయధినాథునితోనను, మోయయ్యయు పేక్షయింక నొప్పవటంచుఁ.  7

గీ. బొమ్మబొమ్మగాదు పూర్ణావతారస, ద్విభవరూపమనుము విమలముగను
యౌవనాంకురమునబీబి యంకస్థ, మాన్యచరితుఁడయ్యె మానదనుము.  8

గీ. మంతనంబెల్ల నీతోడ మనవిచేసి, యుంటిఁగావునసందిగ్ధ ముడుగునటులఁ
బలుకఁగదవమ్మగాంధర్వ పరిణయమును, దెల్పఁగదవమ్మసర్వంబుఁ దెల్లమగును.

క. యతిపతికిరాయభారం, బతివినయంబలరఁబంపనగుఁ దగవనిమా
పితకెఱిగింపుముప్రౌఢిమ, నితిహాసాదులనుగూర్చి యెలమిదలిర్పఁ.  10

గీ. ఆత్మశక్తియుఁ బరశక్తియరసిపిదపఁ, బంతమొనరింపమేలండ్రు పరమబుధులు
ఎదుటయతియాటబలిమి మేలాదవదనుము, హస్తిమశకాంతరం బగునరయవారఁ

గీ. యతులుగేస్తులపైఁ గోపమందిరేనిఁ, జిత్తవిభ్రాంతిగా శాపమిత్తురకట
కానబలవంతమింతయుఁ గాదునెరప, రాయభారమవియ్యం పురాణఁగూర్చు.12

క. చెప్పితిఁగొన్ని తెఱంగులు, సెప్పెడిదేమెల్ల మున్నె చెప్పితిఁగాదే
చెప్పినయంతయుఁగన్నులఁ, గప్పినయట్లెల్ల మీరుఁ గాంచితిరిగదా.  13

క. మున్నెనన్నవ్విన్నది, యెన్నికగామీరలెల్ల నేర్పడిమొన్న
న్నిన్నసుగన్నదియంతయు, వన్నియగాఁగూర్చిచెప్ప వసుధేశసఖా.  14

క. తనకేసుతనైనప్పుడె, యనువగునాకోర్కెలెల్ల నమరిచికొనఁగా
నొనగూడుజన్మమెత్తితి, ననికొందరిదైననె యననగుననుమిసఖీ. 15

గీ. మాటదక్కించికొనుపనిమాత్రమెయను,మన్నియనుమున్నెసమకూరియున్నదనుము
వేయియేటికి వివరంబువిన్నవించి, తానుపేక్షింపఁబనియెట్లొ మానదనుము. 16

క. నాదుహృదీశుండరయఁగ, శ్రీదయితుండతని చెంతఁజేరిననాకు
న్మోదముమున్నేకలదను, తాఁదెలిసియొనర్పఁ బెండ్లి దారియిదనుమీ. 17

చ. అనుచునసేకభంగుల దయారసముప్పతిలంగముందుగా
ననికనిదానఁగార్య ఫలమయ్యెడు నట్టులనైననాగుచుం
గనఁగనదట్లుకానియెడఁ గట్టకడన్వివరించినట్లుగా
ననియొను తేమిచేసియొకోహా యిఁకఁబెండ్లియొనర్పుమీచెలీ, 18

క. నీకంటెనేనునేర్తునె, నాకన్నియునేర్పినట్టి నవలలమిన్నా
నాకైయేదెట్లొనరిచి, యోకార్యముసక్కఁజేసి యొప్పింపఁగదే. 1

క. వలసినయెడనీవునుజను, మలయతిపతిసమ్ముఖమ్మునందుఁదగినచో
బలముననతనికిఁబ్రీతియె, వెలయంగానాథుఁగూర్ప వివరింపుసఖీ. 2

గీ. యతివరేణ్యునితో జోతయనఁగదమ్మ, బీబిఖుర్మిషులనిచెప్పి ప్రియముమీఱఁ
బతినిదయసేయుమని తెల్పుప్రభునితోడఁ బంతమొనరింపవలదంచుఁ బలుకవమ్మ

వ. అనుచునిట్లు బహుప్రకారంబులవినయసంభ్రమంబులు పెనంగొనబీబినాంచారాం
పలుకుటయుదాదివిని యమ్మత్తకాశినిచిత్తంబునఁగలతత్తరం బెఱింగియెత్తెఱంగు
నైనంబనింజొత్తమనియుఁ దత్తదనుకూలవిధంబుల వర్తించికార్యనిర్వాహణంబ
నర్తమనియునిశ్చయించి తగునంతనమ్మకం బగునటులనగు మొగంబొనరియమ
నిట్లనియె. 2

క. నీవచనరచనసూక్తుల, భావంబలరంగనిపుడె పాదుషతోడ
న్నావచనశక్తికొలఁదిని దావకనాయకునిగూర్పఁ దలబొనగూర్తున్. 2

క. వేగమెపెండిలియత్నము, బాగుగనొనరించుదానఁ బాదుషతోనీ
లాగెల్లఁజెప్పియేనే, యోగీంద్రునకెఱుకపఱచి యొప్పింతుఁజుమీ. 2

వ. అనిపల్కిపచ్చవిల్తు శరంబువోలునమ్మచ్చకంటి నెచ్చరించితత్క్షణంబునఁ దన్మం
రంబు వెలువడియమ్మేటి పాదుషాకొలువు కూటంబునకుఁ బ్రక్కద్వారంబున
బ్రవేశించునంత హర్కారధిపతింగని. 2

క. హజరత్ పాచ్ఛాఆదాబ్, బజనాబ్ సఆదతాపుక్క బందెగికహై
బుజురుగ్ దాదిమిలాఖత్, కెజికర్నె ఆయికాహై కెంకినమాలూం. 2

వ. అని దాది హాజరైన విధంబుఁ దెలిపి 'యాహిలాహిఉమద్దౌలజ్జియాదే' యనుచుం
బరాకుమాన్న హెచ్చరింపుడు నా మహీస్థల మహేంద్రుండగు మహమ్మదీయేం
ద్రుండు దృక్ప్రసారమాత్రంబున దర్శనావకాశ సూచకంబు దెలుపుడు హర్కా
రెఱుకపఱప నావృద్ధ దాదిని సమ్ముఖంబునకుఁ జేరనరిగి సముచిత ప్రకారంబులఁ
బ్రణామసంస్కారంబు లాచరించియు. 27

క. బందెగితక్సీరొఖుదా, వందా ఫేర్మెహర్ చహ్నా వాలీ బేటీ
శాందీహజార్మిలాకత్, హుందాదారీహుమర్ జ్ఞహుకుమ్దిలానా. 28

వ. అనుచు విన్నపంబున కవకాశంబొనర్చికొనియు నిట్లనియె. 29

గీ. శల్యపిళ్ళబొమ్మ చనినది మొదలుగ, నింకబొమ్మ లెట్టి వేర్పఱచిన
బిడ్డ కుందుచుండె భీతిచే నీవార్త, మీకుఁ దెల్పనైతి మేటి ఱేఁడ. 30

క. ఏమెన్నియొ విధములబహు, శామోదకరార్థములను హాయిగ నెఱప
న్నోమటు త్రిప్పుచునుండును, సామీప్యమునకును రాదె సరసములాడన్. 31

గీ. నాటఁగోలె నెఱుఁగ దాటలుఁబాటలు, లీలవిషయమెద్ది లేదు సుమ్మి
బొమ్మ బొమ్మ యనెడు నమ్మాటయే తక్క, నెంత వింతయైన నంతకనదె, 32

గీ. అన్నపానంబు లెఱుఁగక యడలుచుండి, పాన్పుదిగకున్న నొడలెల్ల బడలిచెడియె
బొమ్మమాత్రమ్మునకె యింత పుట్టునెయని, వివరమెఱుఁగఁగఁ దెలిసెను వింతనిజము.

క. ప్రోషితభర్తృక చందము, వేషమున నెఱింగియడుగ వివరము తెలిసె
న్భాషణలేటికిఁ ద్రిజగ, త్తోషకుఁడా బొమ్మయయ్యెఁ బురుషుఁడతివకున్. 34

గీ. విడువకడుగఁగ నీబిడ్డ వ్రీడతోడఁ, దెలుపలేనోసి చెలినీవ తెలిసికొనవె
పరిణయంబాయె గాంధర్వఫణితి ననియె, దాపురంబేల నింకనో భూపతీంద్ర. 35

క. మాయలమారిమహాత్ముఁడు, నీయింటం జేరినపుడె నిజభామనుశ్రీ
నోయయ్య నీదుసుతఁగాఁ, జేయించెను గాన నతఁడె చేపట్టఁదగున్. 36

గీ. ఎన్ని నాళ్ళనుండియే మెల్లఁగనలేదు, బొమ్మమాత్రముగనె సమ్మతిఁదగె
సర్వనాయకుండు నిర్వికారుండు నీ, సుతకుఁబతిగ మెఱసె నతులితుఁడయి. 37

చ. అనవిని పాదుషాయని యెనచ్చెరు వౌఁగ దెనీదుమాటయే
వినినది కాదు మీనులకు వింతగఁ దోఁచెడు నేను విన్న నా
తనయకు బొమ్మ నాథుఁడయి దర్శనమిచ్చెనె యెట్టులుండునో
కనితి నె బిడ్డతోఁ ద్రుళవడఁగాదన నేరక వచ్చియుందు నే. 38

క. అనఁగా విని మహానీయా, చను నాయింకెట్టి పల్కుచనె బొమ్మలన
న్నినియుండి వింతపడుచును, జననేర్చిన బొమ్మపనులు సమకూర్పనొకో. 39

చ. త్వరపడియేనువత్తునొకో దర్శనమాత్రమె కాదుపాదుషా
పరమసుఖంబులందితిమి ప్రార్థనమాతనిఁజేసియయ్యనీ
వరసుతనిచ్చిఁగొల్చి తగువార్తలఘాటను విష్ణులోకమే
యిరవనునమ్మికంబొదవె నేటికిమాటలు మేటిభూవరా. 40

వ. అని మొదలిడి బీబికొప్పినతా పొద్రెకంబును దామొనర్చినశైత్యోపచార ప్రకర
ణంబును ననంతరకథావిధానంబు నెఱుకపఱప వెఱఁగంది గోరయుండమరల దాది
యిట్లనియె. 41

గీ. బొమ్మగానెంచవలవదు భువనధరణి, మేలుకోటవిభుండగు మేటిప్రభుఁడు
యాదవాద్రీశుఁడహహనీ కల్లుఁడయ్యెఁ, బురుడునీకేఁడులోకాన భూవరేణ్య 42

క. జేటీకేపాదీశా, ఛేటీయతినాథ్కికర్కి ఫిర్వధిలీదే
నాకీక్ ఫస్లీకర్నా, ఝూటాబిల్కుల్నహీజి చుప్పహిరహో. 43

గీ. దాదిసారాంశములువల్కఁ దావినియును, సందియమువాసినిశ్చయ మందినదిని
బ్రతివిధానంబులేదని పాదుషాయు, దేవమానవసంయోగ భావమరయ. 44

వ. పురాతనపుణ్యకథలను దలంచి పరాత్పరువిలాస విశేషంబులనెంచి నరనాగుల నుర
నేతలు వరియించిన చరితంబులు స్మరియించి పరిణయంబొనర్ప నిశ్చయించి. 45

గీ. రాయబారంబుఁబంపెను రయముతోడ, శల్వపిళ్లకుబీబి నాంచారునకును
బరిణయంబగుననియెడు పత్రికనిడి, పాదుషాయప్పుడాయతిపతికి వేడ్క. 46

క. అందులకాయతిమోదం, బందుటయేకద్గెఁద్రిజగ దధినాయకుఁడౌ
మందరధరుఁడాతనిహృ, న్మందిరమునమఁటకలుగ మఱొకండగునే. 47

గీ. కానరామానుజాచార్యఘనుఁడుమ్లేచ్ఛ,విభునికుత్సాహమొదవించువేడ్కనొక్క
కమ్మవ్రాయించెవిబుధేంద్ర సమ్మతముగ, నట్టిశుభలేఖయదియయ్యె నదెవనంగ.

సీ. శ్రీమన్మహారాజ శేఖరసేవిత శక్రోపమానస చ్చక్రవర్తి
శ్రీమద్రమానాథసేవకోత్తంసుండు దీవించివ్రాయించు దివ్యలేఖ
మిమ్ముమున్దర్శించి మేముకైకొన్నట్టి ముదలకుఁబనులెల్లఁ గుదురువడిన
సెలవింకఁగైకొని సెలవునకేగక యాగియుండినకార్య మరయనిదియె

తే.గీ. ముందుమేమడుగంగాను సందియంబు, నందియుండినమాదేవుఁ డతఁడమిమ్ము
మాకడకుఁబంచెఁగార్యంబు మాకెఱుకయె, యీశునకుఁబ్రీతికరమగు నింతనిజము.

చ. సకలముమే మెఱుంగుదుము సామికిబీబికి సఖ్యమౌటమీ
యకలుషపుత్రిశ్రీరమణి యంశభువింబ్రభావింపనౌటను

పత్రికముగఁ బెండ్లి కార్యమున మాకును మీకును వియ్యమాటసా
త్వికముగ మాపనుల్జరుగ దేవుఁడుమాయెడ నుంటపాటసా 50

క. మీతోడవియ్యమందుట, చేతఃప్రియమగుసుగాని చెల్లదనంగా
మాతగ మెమాయధీశుఁడు, ప్రీతుండై పడకుండె బీబిసులేమాజ్. 51

క. కావునఁదగుసుముహూర్తం, బీవనిరూపించివ్రాసియు నేర్పాటొదవ
న్నైవాధిపతియునేమును, రావిలగువిన్నపములె రాష్ట్రాధీశా. 52

వ. అనియిట్లు శుభలేఖపనుపఁ బనుటయు నమ్మహమ్మదీయప్రభుండచ్చెరువందియుండ ఈ నెఱింగియున్న విషయంబతాను రాజత్వోన్మాదంబున నెఱుంగనైతిఁగదా యంచు విన్నవోయియింకనైన జాగొనర్చక యునన్యాలోచనాలస్యంబు కానీక యుఁబనివడుదమని పూనిసత్వరంబుగ దైవజ్ఞులరావించి సన్ముహూర్తంబు స్థిర పఱిపించి ప్రధానిశేఖరాదుల నెల్లరను వ్యవహారకార్యనిర్వాహకులుగ వారివారిక గుపనులనియోగించి ఢిల్లీపురం బెల్లంగొల్లయగు నుల్లాసంబునరంజిల్లు నటులనలం కరింపించిసర్వం బాయిత్తపఱుటమెఱింగి యింకవధూవరులఁ బెండ్లికుమార్తెం బెండ్లికుమారుంజేయుచుట యయవశిష్టంబనువిషయం వ్రాసన్నముకాఁగ. 53

క. శ్రీరుహితదేవవిహితా, శ్రీయుద్రామానుజార్య శేఖరఆదా
బామేలుకోటనాథుఁడు, మాముద్దులపట్టి నేల మనవిసలుపుమీ. 54

క. ఈపగునుశుభముహూర్తము, మీపతిఁ బెండ్లికొమరునిఁగ మీరటఁజేయ
న్మాపట్టిఁ బెండ్లికొమరిత, యైపరగంజేయువాఁడ నానతియీరే. 55

క. అనిలగ్నపత్రికనపుడు, వినయంబునవ్రాయఁజేసి విబుధావళిచేఁ
బనుపఁగనాయతినాథుఁడు, ఘనమోదంబందె యద్దికనుఁగొనియంతన్. 56

గీ. కార్యమునకును సమ్మతికలదటంచుఁ, దెలుపుశుభలేఖలగ్నపత్రికయనంగ
దీటుఁగాబుచ్చెయతియును మేటికాన, బలఁగముకొలంతె జగదీశుబలమునుదగు.

వ. ఇట్లులగ్నపత్రిక పనిచియాత్రిదండీంద్రుండు బహువిలాసవిశేషంబులతో యాదవాద్రీశుధ్యానావాహనాది సంస్కారంబులనవ్వి గ్రహంబునందారోపించియథా విధిగాసర్వదైవోపచార రాజోపచారంబులు నడపిబంగరుపుట్టంబులును బట్టుదట్టీ యుంగట్టిబహువిధ రత్నాభరణభూషితుంజేసి సముత్సాహసంపన్నుంగా నొనర్చె కొనియుండనటనగరునం బాదుషాయాజ్ఞానుసారంబుగ. 58

సీ. చంపకతైలంబు నింపుగాఁదెప్పించి ముక్కాలిపీటపై ముదితనునిచి
బలువిలాసంబులఁ జెలికత్తియలు కీవిఁదలయంటిపన్నీట జలకమార్చి
స్వర్ణాంబరంబులు సకలభూషణములు మెఱుఁగులీనెడునట్లు మేనఁగొడిగి
పెదపేరటాండ్రందఱు దనదియనిపిల్వఁబడఁదగు పాటలువాడనొక్కట.

తే-గీ. పసపునలుగదిమున్నుగా బహువిధముల, లాంఛనంబులుజరిపి ఖులాసనున్న
బీబినాంచారినప్పుడు ప్రీతితోడఁ, బెండ్లికొమరితఁజేసిరి తెలుగువీడ. 59

క. అనాడట్టులజరుగుట, తానెఱిఁగిదివాకరుండు తద్విషయంబుం
దానాకంబునఁదెలుపఁగ, బోనుండఁనటన్న యట్టు ప్రొద్దటుగ్రుంకెన్. 60

ఉ. దేవునిపెండ్లియంచువిని దేవతలెల్లరు డిగ్గివత్తురో
కొక్కవివరంబెఱుంగునెడఁ గూర్మివహింతురు వారలన్నమై
నావలనీవలంగనఁగనంతటఁ దారలుపిక్కటిల్లెబ
ల్లీవిని బెండ్లివారికగు లెక్కనెయున్నతపీఠపంక్తులన్. 61

ఉ. మందులునాదుభక్తులిటు మానవనాథము ఖాళినిద్దురం
జెందుదురొక్కొ-పావయాట శ్రీఘమపెండిలిఁగోరుచున్నవాఁ
డిందులనేనుగాచినసె యెల్లఘటిల్లును జల్లగానటం
చిందుఁడుపైనిగాపునకు నేర్పడెనానుదయించి యొప్పఁనన్. 62

క. ఆరేయిసామిరామికి, నారాట్సుకుమారికొంత యారసిమసనాఁ
డౌరూఢిగదర్శనమను, కూరిమితోఁగడపెవ గనుగుందకవేడ్కన్. 63

గీ. పనులకేర్పడియున్నారు పాటొనర్పఁ, బౌరులెల్లరునిండ్ల శోభలనుగూర్పఁ
జాలదాయెనెరేయన్నలీలవేగ, వేగుజామయ్యెఁగాలంబు వింతకాదె. 64

గీ. వేగఁబనివడలెండను వివరమునకొ, అందరినివేగలేపెడి యాత్రమునకొ (పుషు.
కూర్మిముమ్మారుకొక్కరో కోయటయనుచు, వాటముగఁబల్కెఁగాలజ్ఞకూటము

క. అంతనగారానౌబతు, సంతసమునమొదలిడంగ సాగినసద్దా
వింతఁగనివెఱఁగుపడెనే, యింతియనంబూర్వకాంత యెఱుపునుదాల్చెన్. 66

గీ. దేవదేవునిపెండ్లియంటే వెలుంగు, జగమునిండెకునంతగ జరుగవలదె
యనుచుదేవతలుంచిన ఘనమణియొకొ, నాగగనమణియెయుదయాద్రి బాగుగఁదగె.

వ. అట్టియెడంగాల్యకరణీయంబులెల్లందీరిచికొన్న యతిశేఖరుండు సకలసన్నాహ
సన్నద్ధులగుబహుదేశాధీశ్వరులునుచతుర్వేదషట్శాస్త్రపారంగతులగు విబు
ధోత్తములును సర్వసంపత్సమృద్ధిగల భక్తజనులును లక్షోపలక్షలుగఁబరివేష్టింప
నొక్కింతతడవువేచి సమయంబునూచిచన వచ్చెనని లేచి పాదుపావలననంపఁబడిన
నూత్నరత్నఖచితంబగు స్వర్ణాందోళికయందుఁ బెండ్లికొమరుని నెక్కించికొని. 68

సీ. సకలదిక్కులయందుఁ బ్రకటనపడినట్టులలప్రతిధ్వనులచేఁదెలియఁబడఁగ
ఢంకానగారాపటహ మృదంగంబులు తాసాలు రుంజలుతబలకులును
డాబుగామ్రోగఁగనౌబతుముఖవీణశ్రుతిసనాయుల తూర్యమతులముగను
ఆడుగడ్డునకుమ్రోగునట్టి ఫిరంగులుజగమెల్లఁదెలిసెను సాధనముగ.

తే-గీ. రంభ మొదలగు నచ్చర రమణులట్లె, వారకాంతలు మేటిరెయొ య్యారములను
భరత నిపుణతయభినయ ప్రౌఢిమమును, జేటపఱచుచు వన్నెగా నాటలాడ. 69

గీ. బయలు వెడలియు ఢిల్లీశు పట్టణమున, లలితముగఁ జేసినట్టి యలంకరణము
నిర్వచింపఁగరానియ పూర్వమగుట, నుల్లసనమునఁ గనుచు రంజిల్లు వేడ్క. 70

క. రాజపథంబున నడచియు, రాజద్వారంబు సేరరంజిలు వేడ్కం
దాజీములు దాఁ జేయుచు, రాజేంద్రుఁడు పాదుషాయె రహి నెదురయ్యెన్. 71

గీ. వచ్చి యల్లునకును యతివర్యునకును, జోడు చేతులు నుదుటను శోభిలంగ
వంగి యాదాబు లొనరించి వారిఁ గొంచు, లోని భవనంబునకుఁ గొనిపోవ నటను. 72

చ. అకలుష వేదవేత్తలు షడంగములం బరిశీలనంబుగా
సకలరహస్యము ల్వరుసశాస్త్రులకెప్పుడు బోధసేయు నా
ప్రకట సుధీంద్ర పంక్తియును భవ్యచరిత్రులు మౌలవీలులో
కిపులఁ గవీంద్రులింకను ఫకీర్లును వాసిను లొప్పియుండుటన్. 73

క. సమయోచిత తంత్రంబులు, సముచిత మంత్రములు సదివి సాగింపంగాఁ
గొమరారు విగ్రహంబు, త్తమపీఠముఁ జేర్చఁగ పుడు దానికి నెదురన్. 74

గీ. కాండపట మొక్కటడ్డము గానుబట్టి, యవల నా బీబి కూర్చుండు నటులఁ జేసి
కార్యములు సల్పినపట్లు కనెమ్ప్రీతి, నందఱుం గఁబడి మాచి రద్దచ్చెనవని. 75

క. బొమ్మఁట పెండ్లికుమారుం, డెమ్మాదిరిఁ బుట్టెఁ గట్టు నెటు కేల్వట్టు
న్నెమ్మన్న లేదు నెట్టులొ, గమ్మతు దెబ్బింగ జల్లి ఖుద్రేయనుచున్. 76

గీ. మ్లేచ్ఛవర్యులు హిందువుల్లేచికనఁగ, వితంయే మొక్కొ బొమ్మయా వంతయైనఁ
బెరుగుతరుగులు లేకట్టె పరగుచుండి, వలయు నెడలను నట్టిట్టు మెలఁగు నదియె.

సీ. పాణిగ్రహణమను పట్టునఁ గాండమ్ము తనయంత లేమట తరుణి కేలు
గట్టిగ నెవ్వండొ పట్టిలాగినయట్లు లొనరుట కాన్పించె జనుల కపుడు
జీలకఱ్ఱ గుడంబు మేలు కోటాధిపు కేలఁ బెట్టఁగ నొప్పె బాలతలను
మంగళసూత్రంబు మహనీయు చేతులఁ బెట్టఁగా బీబికిఁ గట్టఁబడియె

తే-గీ. వింతయదియే మొ పనులిట్లు వివరముగను, గానుపించు నరూపంబు గానఁబడదు
నమ్మకము చిక్కెఁ బనిసర్వ సమ్మతముగ, దైవమహిమంబు నతి కెక్కదారి పాడము.

ఉ. మక్కువఁ జెందియున్నయది మానిని కావున నా పెళ్ళు సదా
నిక్కపుభక్తిఁ దైవి పుల నిష్ఠ భజించు యతీంద్ర మాళికిం
దక్కమ తేరుఁ గందమన దర్శనమీయఁడె మాయలాఁడుమీ
టక్కరి దేవుఁడం చెటుల టాబులు వల్కినవాబులల్లినన్. 79

వ. ఇట్లు బహువిభవశోభితంబుగాఁ బాణిగ్రహణ మాత్రధారణ మహోత్సవంబు జరుగ

క. అందలి పెండిలివారల, కందఱకును భోజనంబు లమరింపంగా
విందులకుఁ దగినయత్నము, ముందే యొనరింపఁబడియె మోక్షాలెక్కన్. 81

గీ. పలుతెఱంగులజీవుల పలలములను, బక్వమొనరించి బహువిధ భక్ష్యభోజ్య
శాకలేహ్యంబులమరిచి సన్నబియ్య, మన్నముగఁ గూర్చి యొడ్డించి యున్నతఱిని. 82

క. విందులు గుడువఁగ వచ్చిన, యందఱిలో యతివరేణ్యుఁ డదికనినంతం
జిందరవందరమదిగా, సందేహించెను భుజింపస హ్యముకామిన్. 83

క. హీరలు హిందువులందును, బారులు రాజులు కిరాట భతోర్త్రముతే
చేరిరిగద యేతీరునఁ, గూరిమి భుజియింత్రో యంచుఁ గూడిరి నూడన్. 84

గీ. తురకలట్టులఁ జట్టులఁ దొంగిచూడ, యతిశిరోమణి యుదకమక్షతలు సల్లెఁ
జూచుచుండంగ నన్నియుఁ జోద్యముగను, మాఱెఁ దిననైన బహుఫలవారములుగ.

క. అది కాంచి పాదుషా బహు, ముదమందిను హోత్మ దేవ ముఖ్యుఁడవీవే
యుదయించితి యతిరాజుగ, విదితంబిది నూడఁ జూడవి విద్యాగ్రములన్. 86

గీ. అనుమఁ గొని యాడి మాకిఁక నానయేమి, నాఁగ నది భాష్యకారి యానరవరేణ్య
మున్న పలలమ్ముఁ గాంచితి మెన్నియతని, గుడువవచ్చును సందేహ ముడుపు మనుచు

క. అనగ నె పాదుషా మహితా, యనఘాత్మా యొగ్గు సైపు మట్లైనను మీ
కనునైన ఫలాహారమె, యొనగూడం జేయుదు నిపుడొద్దికననుచున్. 88

సీ. ప్రీతిగా గోధూమపిష్టము శర్కరఘృతమును గపిలగోక్షీరములును
మీఁగడ జున్ను మిశ్రియు కిస్మిసు చారపల్కులును ఖర్జూరములును
ద్రాక్షఫలములు బాదము కాయ తేలకు లుక్కెంకుమపూవును గొబ్బరయును
బహువిధకదళికాఫలములు చూతము ల్పనసలు కర్బూజ పండ్లు జేమ

తే-గీ. పంఢ్రకమలాఫలంబులు బాడగలుగు, చెఱకు సీతాఫలంబులు జీడిపప్పు
తేనె మొదలగు వస్తువు ల్దెచ్చి యొసఁగి, యారగింపుడు నా ఫలాహారమనుచు. 89

క. అనఁగ నె వానిం గొంచునిఁ, కనుకూలములైనవన్ని యాయితములుగా
నొనరిచ సాపడి సప్పుడు, ఘనులా వైష్ణవులు భూమి కాంతునియింటన్. 90

గీ. అట్లు సుఖభోజనంబుల ద్దైన వెన్క, సరసముగఁ జేసి తాంబూల చర్వణంబు
వేడుకలతోడఁ గాలంబు వెడలఁబుచ్చి, పొద్దుగ్రుంకిన సంతోష పూర్ణులగుచు.

క. ఊరేగింపను వేడ్కకు, స్వారిబయ ల్దేరిరతుల సన్నాహముతో
ధారుణియీనిన యట్టులఁ, గూరిమి లక్షలకొలంది కూడినదపుడున్. 92

క. కండోలుపటహనాదము, డాండామనుచుండడోలు ఢంకా మ్రోతల్
న్నిండుగనడుమనురంజిలు, చుండంగాఁదూర్యఘోషలట నొప్పంగ మ్రోసెన్. 93

క. హిందుస్థానీమేళము, ముందుగ కర్ణాటకపువి మొగినిరుదెసల
న్నందులునడుమను బాదుష, బందుగులనుయతినిగూడి పరగఁగ వెడలెన్. 94

క. పన్నీరమ పుష్పచల్లి రి, మిన్నందినమందనాఁగ మేదినికిడిగ
న్నానావిలవలె మహతాబుల, వెన్నియొ వెల్గుచు నెయ్యుండె నెచ్చటఁగన్నన్. 95

క. హవ్వాచువ్వలలోనం, బువ్వులమైఁదేజరిల్లుపొంది కవివేసం
జివ్వునలేచియుఁడప్పను, సవ్వడిచేయునవికోట్ల సంఖ్యలు వెలిఁగెన్. 96

గీ. చిచ్చుబుడ్లెన్నియనియేరుఁ జెప్పలేరు, చక్రములు బొమ్మలును వేలసంఖ్యలమరు
నిమిష నిమిషమునకు నాట్లు నింగికెగయు, తోరణములట్లు వెల్గించి రౌరకొన్ని. 97

క. నివిటీలు వేలకోలఁదులు, పవలట్లులఁగానుపించు ప్రభనవియేదో
పువ్వులట్లు కానుపించెడి, దివిముట్టి వెలుంగు దీప్తి దేదీప్యంబై. 98

గీ. ఇట్టులమరుమహర్గృహస్థులెల్ల పౌర, వర్గ మీక్షించు వేడుక వారివారి
యనుసరణఁబట్టి సౌధంబు లందునెక్కి, కాంచుచుండిరిసుకలోకో యనుచునెంచ.

వ. ఇట్లా రాత్రియందు ఢిల్లీ పట్టణంబున నెల్లెడల నప్రతిమాన మహోత్సవంబు జరిపిన
గరుసేరి క్రమక్రమంబున నప్పుడప్పటికి విధాయకంబులగు వివిధ హితధర్మంబులన్నియు
జరుపుచు వివాహమహోత్సవసంపూర్తియగుడు శ్రీమద్రామానుజాచార్యవర్యుండు మహమ్మ
దీయ ప్రభుశేఖరునుద్దేశించి యిట్లనియె. 100

గీ. అహహ భూమీంద్ర నీయట్టి మహితులుండ్రె, రూఢిరెండవరత్నాకరుండవీవు
ఎంత్రు గాంభీర్యగుణమున నింతవలదు, హరికిమామైనవరుసయు సరిపడెఁగద. 101

క. కలిగినకొమరితఁ బెనిచియు, వలనెఱిఁగిసు తేచ్ఛఁదెలిసి వరుఁ గూర్చినయ
ట్టులవడుహర్ష మతులితము, తలబరువుందించికొన్న ధన్యతఁ గాంచున్. 102

క. సామాన్యవిషయమందిది, యేమహినెల్లరకుఁగలుగ నీశున కెసుతా
ప్రేమాస్పదమన కెకన్యను, నీమంబుగ నిచ్చితీవ నిర్మలభావా. 103

క. మునునీయింటనెయుండియు, ఘనుఁడై విలసిల్లుచుండి కాంతకుఁ బ్రియుఁడై
జనవిభుతనీకొసంగిన, యనఘుండల్లుండు కాఁగ హాయియగుఁగదా. 104

గీ. సర్వసుఖములుగలవాడు సాధునీకుఁ, దనయయకాబీబి కొక్కటి తక్కువగునె
కానియొటులఁగ నిధవుఁడెవ్వఁడౌనొయనక, ఇంటనుండిన మహనీయుఁ డేసుపడియె.

క. సుతకింకఁగొఱఁతయుండదు, హితమెప్పుడు నీకుసల్పుని హాపరములకు
న్నతియూతఁడె కాదామా, కితరులకే కాఁగవిహాళునిను మిక్కిలియహా. 105

గీ. ఇంతయల్లుఁడుకుదిరె నీకిఁకఁ గొఱంత, సుంతయునులేదు స్వేచ్ఛకాసంతచెడదు
ఏతనికిఁగూర్పనీకిట్టి రీతిపొసఁగు, బిడ్డకతఁ డెట్లులగునయ్య ప్రియసఖుండు. 107

వ. అనియిట్లనేక ప్రకారంబులనప్పాశొప్పిన బాంధవ్యంబువలని గొప్పతనమునకగు
మెప్పునునొప్పిదంపుఁ జొప్పునువిప్పిచెప్పుచు నభివర్ణించుచుఁ గడపట నిట్లనియె.

క. భూమీశ్వరమీనగరున, నేమందఱుమెన్ని నాఁడు లిట్లుండనగు
న్నామేలుకోటకనుపుము, స్వామిన్నాంచారుదేవి సన్నాహముతోన్. 109

క. అనిపల్కు యతిశిఖామణి, ఘనవాక్యమువిశ్వసించి గారాబుసుతం
బనిపూనియడిగియాకెయుఁ, జనఁగానగునన్నఁ జేసె సన్నాహంబున్. 110

గీ. అరణమీయంగననువుగ ధరణిధవుఁడు, హయగజంబులురథభట చయములింకఁ
బరగుబహురత్నఘటిత సువర్ణభూష, ణంబులొనఁగూర్చెఁ గనఁగనాణెంబుగాను.

క. అంతఁ బ్రయాణముహూర్తము, సంతనపడఁ బంగఁబడిన సమయమునందా
యింతులువేవురుఁ గొలిచెడి, కాంతం జనకుండు ప్రీతిఁ గన్గొనిపల్కెన్. 112

చ. కొమరితనీవుపుట్టినది గోలెమహోముదమందు చుంటిని
ల్లమరెడిశోభనంబులకు నాకరమై విలసిల్లనింకనీ
క్రమమునఁగానగాదుగద కాంతునితోఁ జనెదీవు కావునం
దమకమునొందుమానసము ధన్యవునీవయిన ట్లెఱింగినన్. 113

క. అనఁగాసుత క్షితిపతిఁగని, జన కా సర్వేశుకరుణ సకలవిధముల
న్నినుదేర్చు మోహపాశం, బునువిడిపించియుసుజ్ఞాన పూర్ణతనిచ్చున్. 114

క. అనుచున్న వనీజనకుల, కనురాగముతోడ మ్రొక్కి యాయుతకాఁగాఁ
జననాథునాన వెడలిరి, ఘనయతినాథాది భక్తకాండముఁ గూడన్. 115

గీ. వారివారికిఁదగినట్టి వాహనముల, నధిష్ఠించిపురవీధి యందుఁ గదల
నిరుకెలంకులహారతు లిచ్చుచుమిసను, పౌరకాంతులుగనవచ్చి నారిఁ జూచి. 116

గీ. బొమ్మపెండ్లియాడి భూమీశునసుమతి, దీనసర్వసౌఖ్యమూనెదనని
పరమముదముతోడ భాసిల్లుచునుజను, నట్టిబీబిఁ గనరె యతివలార. 117

క. తానేకావలెననుచును, మానవనాయకునిఁ గోరి మగనిఁగ బొమ్మం
బూనికఁ బెండిలియాడెనె. యీనెలఁతమహాయియిందునే మగునోకో. 118

గీ. ముద్దరాలుగానముదిత సౌఖ్యమెఱుంగ, రాకబొమ్మలాటరహిమరంగి
కోరియుండునోకో కొన్నాళ్ళకైనను, బురుషవాంఛగలుగఁ బరుసరయదొ. 119

క, కాదటెసఖిరో బొమ్మనఁ, గాఁదగదటె రేలనెపుడుఁ గాంతునిమైనా
మోదముఁగూర్చెడినంటే, యీదేవునిమహిమ మెఱిఁగియే కోరెనటే. 120

గీ. సెల్వపిళ్లయనెడి శ్రీనాథుఁడందురే, తురకబీబినెట్టు మరగెనమ్మ
నమ్మరాదుమాటనా మదికిదిచూడ, [మున్నెఱుంగలేని పిన్నచెయ్వొ 121

క. కాదేయతివాయెల్లరుఁ, బాదుషనగరందు మొన్నఁబరిణయవేళ
నోమ్మదముగాఁగనిరంటే, యాదేవునిచిద్విలాస మంతయుఁ గేలా 122

క. సందేహమెబొమ్మెహరి, యిందీవరనేత్రబీబియే శ్రీసతియా
వందితుఁడౌయతిరాజున, కందెలినెడిఁదెలియఁగలదె గుణహీనులకున్. 123

క. చిరకాలమువధిగానిటుఁ, జెఱఁబెట్టంబడినయట్టి జేజేలెల్లం
బిరబిరనడవఁగఁజేసెను, హరిభక్తుండీతఁడంద్రు హరిమనకితఁడే. 124

క. బొమ్మలునడచిన దెఱుఁగుట, నమ్మెదరీతనిమహత్తు నవలానటులే
యమ్మహితునేస్తమబ్బిన, కొమ్మగనమ్మటకునేమి కొఱఁతగలుగునో, 125

గీ. ఎఱుఁగకుండినగుణహీను లెందఱోయయి, భూమిఁబుట్టుచుఁజత్తురు పురుషులట్లు
జన్మసాఫల్యముంగన్న సాధులేగా, దేవహితులయికంద్రిట్టి దివ్యమహిమ. 126

క. మున్నుపురాణంబులలో, నెన్నియొకథలిట్టివెఱుఁగ నేర్పడెవినమే
యిన్నాఁడిదియును వన్నియ, నెన్నికవదుపుణ్యకథగ నేర్పడుభువిలోన్. 127

వ. అనుచు నానాప్రకారంబుల వారివారి ప్రాజ్ఞతకొను గుణంబుగఁ బల్కుచుండు వారును వారింబంపుటకు మాత్రమె వెనుబడినందునఁ గొంతదవ్వరిగి సెలవంది నిలుచు వారును జూచుచుండఁగనే చూపుమేఱఁగడచి యాడనాడవిడియుచు మేల్కోట కనతిదూరంబు నన్విశాలప్రదేశంబునం బటకుటీరంబుల మరిచికొని యాడన్నిలుచు నెడ దేవియు న్దేవేశ్వరుండు! నొక్కెడను దత్సన్నిధానంబున యతీంద్రుండును వసియించి వారికవుల నివులవిశాల కుటీరంబులందొకఁట నిఖిల భక్తాగ్రగణ్యులును మఱొక్కెటం బాదుషాయంపిన ముఖ్యులున్ని వసించియుండు నట్లేర్పఱచి యట్లొ క్కింతకాలంబుండు నెడ నాచార్యవర్యాజ్ఞానుకూలంబుగాఁ బ్రయత్నంబులునడవ.

క. హిందూప్రభువులటందఱు, మందానందమునగురుని మహితార్థంబుల్
పొందికగావినివలసిన, చందంబులమెలఁగిరెల్ల సన్నాహములన్. 129

గీ. పరగరాజేంద్రులాయిత్త పఱచిపట్టి, సకలవైభవములుఁగూడి యొకటఁజేర
మున్నుఢిల్లీనిగర్గొన్న వన్నెకన్న, మిన్నయిదియయ్యెనేరైన నెన్నఁగలరె. 130

వ. ఇట్లనేక మహీనాథవరేణ్యులచేతఁ బనుపంబడిన రథగజతురంగోష్ట్రభట సమూహంబులును బహుధనధాన్యరాసులును జీనిచీనాంబరంబులును వినూత్నరత్నఘటితసువర్ణభూషణంబులును బహువిధఫలపుష్పనికరంబులును వందిమాగధనటగాయకసందోహంబులును హృద్యంబులగు వాద్యవిశేషంబులు నింకంబొంకంబులగు నక

లంకవస్తుసంకులంబులును జేరం దత్ప్రదేశంబు త్రయస్త్రింశత్కోటిదేవదేవయోని సమావృతనాకలోకంబు భాతి విలసిల్లియుండె నట్లుండ నమ్మఱునాఁడు తిథివారోడులగ్నధ్రువక మిశ్రితంబై పంచకరహితంబగు సుముహూర్తంబు నిర్ణయింపం బడుటయు నాఁడు సాయాహ్నంబున బీబీనాంచారాంబ భక్తలోకంబును బరిజన సమూహంబును బ్రియంబున నవలోకించి వారెల్లరు నీభవంబున నిహంబున సకల సుఖంబులనను భవించి జన్మాంతరంబున విష్ణుసాయుజ్యంబుగను నట్లువరం బొసంగి నాఁటిరేయి నటకు రాఁగల రాజేంద్రులకు దర్శనంబీ నొల్లని యాత్మాభిమతంబు యతివర్యున కెఱుకపఱచి నిజాధీశుండగు జగదీశునను మతంబునఁ దానువిగ్రహస్వరూపంబుఁ బడయుటకు నందఱకును మహాశ్చర్యకరంబయ్యె నంత. 131

క. మఱునాఁడట సంప్రోక్షణఁ, గరమానందంబుతోడఁ గావించి జగ
ద్వ్యరుశల్వపిళ్లనాథునిఁ, దరుణీమణిబీబిఁ గూర్చి తాయతినిలిపెన్, 132

క. అంతట సంతసముగ భువ, నాంతర్యామికిని బీబికప్పుడు మరల
న్వింతగఁ గల్యాణోత్సవ, మెంతయు రమ్యముగఁ జేసి రేలిక లెల్లన్. 133

గీ. నాఁటఁగోలె మేలు కోటను బీబియు, సెల్వపిళ్లవిభుఁడుఁ జెలఁగుచుండి
సకలభువనములను సంరక్షణంబు తా, మొప్పఁ జేయుచుండ్రు మెప్పుగనుచు. 134

క. ఇది యాదవాద్రినాయకు, సదమలచరితంబు దీనిఁ జదివిన విన్నం
గుదిరిక నైహిక సౌఖ్యముఁ, బదపడిఁ బర సౌఖ్యమునగు బ్రజలకు నెల్లన్. 135

క. మనమున నెకార్యంబును, ఘనముగ వాంఛించి యిద్ది కాంక్షఁ జదివిన
న్మనుమం దుగ సద్దయ్యెడి, ననఘుణ గాఁబిదపఁ గోర్కెలన్ని యుదీరున్. 136

క. శ్రీదామధుసూదనదా, మోదరకరి రాజరక్షము నిజనదక్షా
మోదాకరకరుణానిధి, సాదరదితిపుత్త్రశిక్షసజ్జనపక్షా. 137

భుజంగ. సరోజాతపత్త్రాక్ష సత్వప్రచారా, సరిన్నాథగంభీరస్వర్ణాద్రిధీరా
పురారాతిమిత్ర ప్రభూరమ్యమూర్తీ, సురారీంద్రసంహారజ్యోత్స్నాచ్ఛకీర్తీ

గద్య. ఇది శ్రీహేమపాలస గోత్రకామిసెట్టివంశపవిత్ర శ్రీవేంకట
దాసపుత్రపేరమ దొరాఖ్యసుకవిమిత్ర ప్రణీతంబయిన
యాదవాద్రీశోపాఖ్యానంబునందు సర్వంబును
దృతీయాశ్వాసము
సంపూర్ణము.